# శృంగారపదములు

(పాటలు—పద్యములు)

ప్రాచీన అజ్ఞాత కవికృతము

సంపాదకులు

శ్రీ పి. సీతాపతి, I.A.S. F.R.C.S. (Lond.)

శ్రీ కె. వెంకటేశ్వరరావు




పీఠిక

వాఙ్మయ మహాధ్యక్షత

డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

"కళాప్రపూర్ణ"

# పీఠిక

ఇది 'శృంగారపదములు' అన్న గ్రంథం. పాటలుగా ఒక భాగమూ పద్యాలుగా ఒక భాగమూ వున్న యీరచనా సంకలనానికి "శృంగార పదములు" అని ఒకే ఒక్క పేరు పెట్టడం జరిగింది.

'పద'మంటే లోకంలో చాలా కాలంగా పాట అన్నఅర్థం-పరివ్యాప్తమయి వున్నది. ఈ దృష్ట్యా పాటలుగావున్న భాగాన్ని పదభాగమనీ, పద్యాలుగావున్న భాగాన్ని పద్యభాగంఅనికూడా అనవలసివస్తుంది. వస్తుస్థితి పరిశీలిస్తే పదపద్యాలకు భేదం కనిపించదు. పదమంటే పద్యమనీ, పద్యమంటే పదమనీ, భావించడంలో శాస్త్రీయంగా దోషంలేదు. శాస్త్రాంతర్యం పరిశోధనా దృక్పథంతో తెలిసినవారు గాని, మామూలుగా లోకంలో అత్యంత సామాన్యులయిన పామరులుగాని, పదపద్యాలకు భేదం పాటించరు. సామాన్యంగా పని పాటలు చేసేటప్పుడు ఉత్సాహం కోసమో, పరిశ్రమమూలకమైన బడలిక పైవునుంచి మనస్సును మళ్లించడం కోసమో, కాలక్షేపం కోసమో, ఏదైనా ఎవరైనా పాడితే బాగుంటుంది అనుకున్నప్పుడు "ఒసేయ్ బుల్లీ! పదం అనవే" —'పదం ఎత్తవే'—'పదం అందుకోవే'—'పదం పాడునే'—వంటి మాటలతో కోరడం జరుగుతుంది. ఇటువంటి సందర్భాలలో యీకోరికమీద కేవలం పాట మాత్రమే పాడడం జరుగదు. పద్యాలుకూడా పాడడం జరుగుతుంది. 'పదం అనవే' అంటే కేవలంపాటమాత్రమే పాడాలని అవతలివారు — అర్థితులు అనుకోరు. పాట — పద్యాలలో దేన్నయినా పాడవచ్చు. రెండూ పాడడం కూడా జరుగుతూవుంటుంది. అంటే పదంఅంటేపాటాకావచ్చు, పద్యమూకావచ్చు నన్నమాటపామరులదృష్టిలో. రగడ—తరువోజ—ద్విపదలవంటివేవైనా బాగా సంగీతం మేళనం చేసి పాడారనుకోండి అప్పుడవి అసలు పాటలనే అనుకుంటారు. మామూలు మనుషులేకాదు, ప్రత్యేకించి ఛందోలక్షణాలను దృష్టిలో పెట్టుకుని పరిశీలించిన వారైతేనేతప్ప లేకపోతే అందరూ—విద్యావంతులు కూడా పాటలనే భావిస్తారు. ఈ సందర్భంలో ఒక విషయం మనకు సుస్పష్టమవుతుంది. సామాన్యంగా లోతుగా పరిశీలించి వ్రాసిన శాస్త్రాలల్లో సరైన విషయాలే వుంటాయి. తరతరాలుగా శాస్త్రాలతో సంబంధం లేకపోయినా ఆయాశాస్త్రవిషయాలు సాంప్రదాయ బద్ధంగాగాని అనువంశికంగా గాని లేదా గురుశిష్యపరంపరగా గాని చెప్పికొనడంవల్ల వచ్చే విషయాలు ఆనోటా ఆనోటా పడి నోటిమాటగానే విద్యావిహీనులయిన పామరులలో నిల్చి వుంటాయి. ఇక అనేకమంది శిష్టులు-అంటే ఉన్నత వర్గాలకు చెందినవారు, అనబడేవారు విద్యావంతులం అనుకుంటారు. వీరికి కావలసినంతగా శాస్త్రజ్ఞానమూవుండదు. పామరవ్యవహారాల ఆంతర్యం తెలుసుకుందామనీ వుండదుసరికదా వారిపట్ల ఒకానొకచులకన భావంకూడా వుంటుంది. ఇక మామూలు విద్యాసంస్కార ప్రభావంవల్ల సంఘంలోవచ్చే మార్పులకు ఆమోదముద్రలు వేసుకుని, "మాది శిష్టం మాదే

సరైనది" అన్న భావాన్ని యీ శిష్టులేర్పరచుకుంటారు. ఇది ఏరూపంలో చూచినా వాస్తవాన్ని ప్రతిబింబించదు సరికదా ఒక్కొక్కప్పుడు అసలు వాస్తవం కాకుండా కూడా పోతుంది. ఇందుకు, యీ పదపద్య శబ్దార్థాలే ప్రత్యక్ష ప్రమాణాలు. పాట, పద్యం, రెండూ పామరులలో పదశబ్ద గ్రాహ్యాలవుతున్నాయి. శాస్త్రీయంగా కూడా ప్రాచీన కాలంలో గ్రాహ్యాలయ్యాయి. విద్యావంతుల మనుకున్న శిష్ట సంఘంలో చాలాకాలంగా పదమంటే పాట అనీ, పద్యమంటే పాటకు భిన్నమైన వృత్తమో లేక పద్యమో అనీ భావం ఏర్పడింది. లోతుగా పరిశీలన చెయ్యని కవిపండితులు కూడా యీ శిష్ట సంఘవలయంలోవారేకాబట్టి వారు పదమంటే పాట అనీ, పాటనే నిర్దేశిస్తూ గీతం అనీ, అర్థాలు వ్రాశారు. ఈ దృష్టి తోనే ఆ శబ్ద ప్రయోగం కూడా చేశారు. పరిశీలన చెయ్యకుండా చేసిన పొరపాటు సామాన్యులు చేస్తే పెద్దపట్టించుకోంగాని లక్షణ వేత్తలైన వారే చేస్తే వస్తు స్థితిని గుర్తించే వరకూ, మనల్ని తికమక పెడుతుంది.

## అక్షరచ్ఛందస్సులు—మాత్రాచ్ఛందస్సులు

తెలుఁగులో తొట్టతొలుత క్రీ.శ. 11 వ శతాబ్ది ప్రారంభంలో రచించబడిందని యెంచబడిన కవిజనాశ్రయచ్ఛందోగ్రంథంలో, కావ్యవిభాగం గురించి చెబుతూ తత్కర్త *

హృద్యానవద్య కావ్యము
గద్యము పద్యమని చెప్పగా ద్వివిధమగున్
గద్యంబపాద పదనిక
రద్యోతిత నవరసార్థ రచనల నెగడున్.

అని అన్నాడు. గద్య పద్య భేదాలతో కావ్యం రెండు విధాలన్నాడు. గీతికా–గేయ– (పాటల) కావ్యం అని ప్రత్యేకించి మూడవ విభాగాన్ని పేర్కొని చూపలేదు.

అసలు వృత్తాలలో తాళలయాన్వితం కాని–నడకలేని, పద్యాలెన్నో వున్నాయి. 26 చ్ఛందస్సులను మించి అంతకంటే ఎక్కువ అక్షరాలున్న పాదాలు గల ఉద్ధురమాలావృత్తాదుల సంగతి చెప్పనక్కరలేదు. తాళలయాన్వితాలై, కేవలం నడకగల్గి మాత్రమే కాదు, పాటలవలె పాడడానికి కూడా వీలుగా వుండే వృత్తాదులూ వున్నాయి. రకరకాల పాటలన్నింటికి, మాత్రాబద్ధాలవలె ప్రాతినిధ్యం వహించగల యీ సంస్కృత చ్ఛందస్సులే మూలమవుతాయి.

---

* కవిజనాశ్రయ కర్తృత్వ విషయం వివాదాస్పదం.

నాలుగు పాదంబులతో
నాలుగు ప్రావళ్ళు కూడినను పద్యము ప
ద్యాలియు నిరుతెరగై చను
నోలిన వృత్తములు జాతు లొనరన్ గృతులన్.

కావ్యం గద్యపద్యాత్మకంగా రెండు రకాలని విడదీసినా, పద్యం వృత్తాలు, జాతులు అని, రెండు రకాలన్నాడు తిరిగి జాత్యధికారంలో.

జాతులు మాత్రాసమక
ఖ్యాతి గణప్రతతిఁజెప్పఁ గందములార్యల్
గీతులు మొదలగునవి యుప
జాతులు భూతల వినూత్నజాత యశస్కా!

అంటూ జాతి, ఉపజాతి భేదాలతో జాతులు రెండు రకాలన్నాడు. ఇంతా చెప్పీ కూడా మిన్నకుండలేదు. జాతుల్లో తెలుఁగు జాతులువేరు అని ప్రత్యేకంగా నిర్ధేశించి సీస-తరువోజ-అక్కర-ద్విపదాదుల లక్షణాలు చెప్పాడు. ఎన్నెన్ని విధాలుగా వున్న దేశీయచ్ఛందస్సులయినా సమ-అర్ధసమ-విషమాది భేదాలతోవున్న అనంత కోటి సంస్కృతచ్ఛందో రీతులలో అంతర్లీనాలయిపోతా యన్న సంగతి కవిజనాశ్రయ కర్త కూడా గమనించలేదు. కాబట్టే దేశజాతులు వేరన్నాడు. సంస్కృతలక్షణంతో కూడిన రచన అయినా దేశి అనుకొనబడే లక్షణంతో కూడుకున్న రచన అయినా, పద్యమే అవుతుంది. పద్యశబ్దంచేత మాత్రాబద్ధాలయిన గేయాలు కూడా గ్రాహ్యాలేఅవుతాయి.

వృత్తాలు గణసమకబద్ధాలు- జాతులు మాత్రాసమకబద్ధాలు అన్నాడు కవిజనాశ్రయకర్త. గణ సమకబద్ధత్వం అంటే అక్షరచ్ఛందస్సని, కవిజనాశ్రయ కర్త అభిప్రాయం. కాని, వాస్తవం పరిశీలిస్తే గణసమకత్వానికీ, అక్షరసమకత్వానికీ, సంబంధం వున్నదికాని, అది అవినాభావ సంబంధంకాదు. అక్షర సమకత్వంలేకుండా కూడా గణసమకత్వం వుండవచ్చు. "రాముడు"-"కాముడు" వంటి వాటిల్లో గురులఘ్వక్షరసమకత్వం, గణ సమకత్వం ఉన్నవి. "రాముడు"-"భర్గుడు" అన్నపుడు రెండూ భగణాలుకాబట్టి గణసమకత్వం వున్నది. అయితే, గురులఘ్వక్షరాల్లో, సమకత్వం ఒక విధంగావున్నా, అక్షరస్వరూపయథాతథవ్యవస్థలో సమకత్వంలేదు. రాముడన్నపుడు 'రా' సహజంగా గురువు భర్గుడుఅన్నప్పుడు 'భ' సహజంగాగురువు కాకుండా, లఘువే అయి, దాని పరంలో సంయుక్తంవుండడంవల్ల, గురువవుతుంది. కాగా అక్షర సమకత్వం లోపిస్తుంది.

కావ్యం గద్య పద్య భేదాలతో ద్వివిధమన్నంత సునిశితమైన దృష్టితో, వృత్తజాతి గణబద్ధత్వం గురించి, కవిజనాశ్రయ కర్త పరిశీలించినట్లు కనపడదు. వృత్తాలు గణసమక బద్ధాలే! అర్ధసమ-విషమవృత్తాల కీగణసమకత్వం ఏ కొంతో

తప్ప పరిపూర్ణంగా వర్తించదు. వృత్త-జాత్యుపజాతి పద్యాలన్నీ అన్ని అవస్థలలోను, సమగణ మాత్రాకాలే కానవసరం లేదన్న సంగతి కవిజనాశ్రయకర్త గుర్తించలేదు. ఇంతా అయితే జాతి భేదాలని పేరు తప్ప కందంలోనూ మాత్రాసమకత్వానికి కూడా స్థానంవున్నది. ఆర్యామూలంగా రూపొందిన గీత్యుపగీతుల్లోను మాత్రాసమకత్వానికి కూడా స్థానంవున్నది. ఆర్యలో మాత్రాసమకత్వం వుండదు. కందం ఆర్యగా రూపొందడంలో ప్రథమ ద్వితీయార్ధాలలో తుదిగణం గురువుగా మారడంలో సమానత్వమే వున్నా. ప్రథమార్ధంలో ఆరవగణం చతుర్మాత్రాకమై, ద్వితీయార్ధంలో ఆరవగణం కేవలం, ఏక మాత్రాకమేఅవుతుంది కాబట్టి మాత్రాసమకబద్ధం కానేరదు. దీని వ్యుత్క్రమం వల్లనే, ఉద్గీతి రూపొంది ప్రథమార్ధంలో ఆరవగణం ఏకైక మాత్రాకమై, రెండవ అర్ధంలో ఆరవగణం చతుర్మాత్రాకం అవుతుంది. కాబట్టి యిదికూడా మాత్రాసమకం కాదు. తెలుగు జాతులనిపించుకున్న వాటిల్లో కూడా కొన్ని సమమాత్రాబద్ధాలూ, కొన్నిఅసమ మాత్రా బద్ధాలూ అవుతాయి. సీసం, తరువోజ, అక్కర, రగడ, ద్విపదాది జాతులన్నీ సూర్యేంద్ర చంద్రగణాలతో కూడివుంటాయి. ఆటవెలదిలో సరిపాదాలు సమమాత్రాకాలుగానే వుంటాయి, బేసిపాదాలు సరిపాదాలతో సమంగా వుండవు సరికదా, తమలోతాము సమమాత్రాకాలయి తీరాలన్న నియమంకూడా లేదు. సమ అసమత్వాలలో ఏదైనా కావచ్చు. కేవల సూర్యగణాలు సమమాత్రాకాలే! ఇంద్ర గణాలు సమమాత్రాకాలుకావు. చంద్రగణాలు కూడా ఇంతే! నల భగణాలు చతుస్సమ మాత్రాకాలు, కాగా మిగిలిన నగ, సల, రలు పంచసమ మాత్రాగణాలు. ఉత్సాహం, ఎన్నుగీతియవంటి వాటిలో సమమాత్రాకత్వానికి స్థానంవున్నది. ప్రత్యేకించి కావాలని పట్టుపట్టి సమమాత్రాగణాలే వాడి వ్రాయాలనుకుంటే యీ తెలుగుజాతి పద్యాలలో చాలా పద్యాలను సమమాత్రాకపాదాలు గలవిగానే వ్రాయవచ్చు. ఉదాహరణకు సీసం తీసుకుందాం, సీసపాదానికి 6 ఇంద్రగణాలు, 2 సూర్యగణాలూ కదా వుండేది. సమమాత్రాకత్వంలో ఇంద్రగణాలు 'నల' 'భ'లు రెండూ ఒక వర్గం క్రిందకు 'నగ' 'సల' 'రగ'లు నాలుగూ మరోవర్గం క్రిందకూ వస్తాయి. కాబట్టి, వీటి మాత్రాసమకత్వాన్ని దృష్టిలో పెట్టుకుని, సమత్వానికి భిన్నంకాని గణాలనే ఉపయోగించి సీసపాదాలు వ్రాయవచ్చు. అంటే కేవల 'నల' 'భ' గణాలు మాత్రమేకాని 'నగ' 'సల' 'రగ' లు మాత్రమేగాని ప్రయోగించి ఆపరువాత సూర్యగణాలు పయోగిస్తే సమమాత్రాకాలవుతాయి. న, హ (గల)లు సమమాత్రాకాలుకదా! కావాలని చేస్తే సమమాత్రాకత్వం వస్తుంది. యాదృచ్ఛికంగా, అప్రయత్నంగానే జరిగితే అది వేరుమాట. అంటే బుద్ధిపూర్వకంగా వ్రాయకపోయినా, సహజంగానే సమమాత్రాకాలైన గణాలు దొర్లవచ్చునన్నమాట. ఆటవెలది వంటివి తప్ప మిగిలిన తెలుగు జాతులన్నీ ప్రయత్నపూర్వకంగా కావాలనుకుంటే సమమాత్రాకగణాలు కలవిగా మాత్రమే కాదు, సమగణాలు కలవిగా కూడా ఉండేట్లు మనం రూపొందించవచ్చు. అది మనం చేసుకునే వివక్ష మీదకూడా ఆధారపడి వుంటుంది. ఇంద్రగణాలు ఆరింటిలోను ఒకే ఒక్క యింద్రగణాన్ని ఆరుగణాలుగా ప్రయోగించి, పిదప ఒకే సూర్యగణాన్ని పునరుక్తిగా రెండుగా ప్రయోగించి అన్ని పాదాలూ ఆవిధంగానే వ్రాసి సీసం వ్రాయకూడదని

ఎక్కడుంది ? అన్ని పాదాలలోను, యింద్రగణాలన్నీ భగణాలే పెడతాం. సూర్య గణాలన్నీ నగణాలే పెడతాం అనుకోండి. అప్పుడు మాత్రాసమకత్వమేకాదు, గణ సమకత్వం కూడా రాక ఏమౌతుంది ? ఇంతకూ చెప్పవచ్చేదేమంటే కవిజనాశ్రయ కర్త జాత్యుపజాతులు సమమాత్రకాలని పేర్కొనడం అన్నిసందర్భాలలోను వర్తించదు. కొన్నింటికే, కొన్ని సందర్భాలలోనే వర్తిస్తుందని మాత్రమే.

తాళలయాన్వితాలైన 'విద్యున్మాల', 'భుజంగ ప్రయాతా'దివృత్తాలు గణసమక బద్ధాలే అయినా వాటిని మాత్రాసమకబద్ధాలుగా భావించినా వచ్చే విప్రతిపత్తి యేమీలేదు. వాస్తవానికి అర్ధసమ, విషమ వృత్తాలని మినహాయిస్తే మిగిలిన వృత్తాలన్నీ గణసమకబద్ధాలేకావు, మాత్రాసమకబద్ధాలు కూడా అవుతాయి. అయితే గురువివక్షావ్యవస్థలో మాత్రం హ్రస్వాక్షరంమీది అర్ధ మాత్రను, దీర్ఘాక్షరంమీది అర్ధమాత్రను, విశిష్టదృష్టితో చూడవలసి వస్తుంది. మాత్రాదృష్టిలో హ్రస్వంమీదిఅర్ధమాత్ర మాత్రగా పరిగణితం కాగా, దీర్ఘం మీది అర్ధమాత్ర లెక్కలోకేరాదు. కాదు కూడదని, యీ అర్ధమాత్రలను పరిగణించే టట్లయితే, అప్పుడుకూడా, సమమాత్రాకత్వం వివక్షమీదే ఆధారపడి ఉంటుంది. అందువల్ల కేవలం మాత్రాపరిగణనలో సంఖ్యాదృష్టితో చూస్తేనే తప్ప, లేకపోతే మాత్రాసమకత్వంలోయీ అర్ధమాత్రవల్ల వచ్చే యిబ్బంది ఏమీ వుండదు.

వృత్తాలకుండే వైశిష్ట్యం ఏమంటే ప్రతి పద్యానికాపద్యం ఆ యా పద్య పాదాలలో గురు, లఘువుల క్రమంలో వ్యత్యస్తతకు స్థానం ఉండకపోవడం. కాబట్టే గణసమకబద్ధాలు అనబడ్డాయి. ఇప్పుడసలు విషయంలోకి వద్దాం ! గణసమక బద్ధాలైన వృత్తాలలో తాళలయాన్వితాలై రాగయుక్తాలు కాగల వృత్తాల విషయం అలా వుంచుదాం. తెలుగు జాతులు సమమాత్రాకాలు—అసమ మాత్రాకాలు—సమగణకబద్ధాలుగా సైతం అవతరించవచ్చునని యింతకుముందే తెలుసుకున్నాం. ఏవిధంగా అవతరించినా అన్నీ పద్యాలే కదా ! అసలు లోతుగానే పరిశీలించనక్కరలేదు. పైపైన పరిశీలించినా, గేయాలలో—పల్లవి అనుపల్లవులను విడిచిపెడితే—చరణాలలో యీ సమమాత్రాకత్వ—అసమ మాత్రాకత్వ—గణసమకత్వాలలో ఏదో వొకటి గోచరం కాకతప్పదు. గణసమ కత్వాలను పరిగణించినా పరిగణించకపోయినా, సమమాత్రాకాలను, అసమ మాత్రాకాలను దృష్టిలో పెట్టుకుంటే ఏ విధమైన గేయరచనాచ్ఛన్దమైనా వివిధ వృత్త జాత్యుపజాతుల్లో చక్కగా చోటుచేసుకొని ఎక్కడో ఒకచోట స్థానం సంపాదించుకుంటుంది. * కాగా, గద్యభిన్నమైన రచనల నన్నింటిని పద్యరచనలుగా పేర్కొనడంలో ఔచిత్యమూ వాస్తవికతలే వున్నవి కాని, అనౌచిత్య అవాస్తవికతలు లేవు.

---

* మాత్రాకలా లఘుర్లః స్యాత్తద్గణాశ్చషచాస్తథా !
స్యుఃపట్ పంచ చతుస్త్రి ద్విసంఖ్యమాత్రాం యుతాఃక్రమాత్ ॥
(సంగీతరత్నాకరః)

అంటూ సంగీతశాస్త్రంలో పేర్కొనబడిన ఛ, ష, చ, త, రతి, కామ, బాణ నామకాలైన మాత్రాగణాలతో యిక్కడ సంగీత సందర్భంగా సరిపోల్చి వ్రాయడం జరుగలేదు. ఈ దృష్ట్యా యీ పీఠికలో విమర్శకు తావులేదు.

"కదా వా త్వదీయం ముదా పాదపద్మం
సదా సేవితుం మే నిదానం దదాసి"

అంటూ పాడుతుంటే కేవలం పామరులే కాదు, యిది భుజంగ ప్రయాతవృత్తం అని గుర్తించలేని కవిపండితులు కూడా, యిదేదో తాళ లయాన్వితమైన గేయం (పాట) అనే అనుకుంటారు. ఇదేవిధంగా, తాళ లయాన్విత మైన పాటను అసలు పాడకుండా తాళరహితమైనదిగా తగువిధంగా శబ్దాల విరుపుతో చదివితే అదేదో ఒకానొక ఛందోబద్ధమైన పద్యం అని (పద్యమంటే వృత్తమే కానక్కర్లేదుకదా! జాత్యుపజాతుల్లో ఏదైనా కావచ్చు) కవిపండితులు కూడా భావిస్తారు. కాగా వృత్తాలను, జాత్యుపజాతి ఛందోభేదాలను మూల భూతం చేసుకొని అవతరించిన గేయాన్ని దేన్నయినా పద్యమంటే దోషంలేదు. వృత్తాలలో తాళ లయాన్వితాలు వున్నాయి, తాళలయరహితాలూ వున్నాయి. ఇదేవిధంగా జాత్యుపజాతుల్లో కూడా తాళలయలకు లొంగేవీ వున్నాయి, లొంగనివీ వున్నాయి. కాబట్టే కవిజనాశ్రయకర్త, గద్యకావ్యాలు—పద్యకావ్యాలు అని కావ్యాలు రెండు రకాలని చెప్పాడు. * (వృత్తజాత్యుపజాతి పద్యాలు, అన్నీ అన్ని అవస్థలలోను, సమగణకాలు, సమ మాత్రాకాలు మాత్రమే కానవసరం లేదన్న సంగతి కవిజనాశ్రయకర్త గుర్తించలేదన్నది వేరుమాట).

## గీతం అంటే

చాలాకాలంగా గీతం అంటే పాట అనే అర్థం విస్తృతిని వ్యాప్తి నందింది. ప్రాచీన వ్యవస్థను పరిశీలిస్తే, తేటగీతి—ఆటవెలది—ఎత్తుగీతి—ఉద్గీతి—ఆర్యాగీతి— మొదలైనవి తెనుగు సంస్కృతాలలో భేదం లేకుండా, అన్నీ గీతాలే అయ్యాయి. ఆర్యను ఆర్యాభేదాలను, భరతాది లక్షణకారులు ఆర్యావృత్తం చపలార్యావృత్తం అంటూ వృత్తాలుగా కూడా పేర్కొన్నారు. వృత్తమే అయినా గీతిగా కూడా రూపొంది 'ఆర్యాగీతి' అని ప్రసిద్ధం కాలేదా! అసలు గానం చేయడానికి వీలైనదేదైనా గీతమే. తెలుగు పద్యాలనబడేవి కాని (అంటే దేశీయ ఛందో పద్యాలన్నమాట) సంస్కృత వృత్తాలనబడేవి కాని ఏవైనా పాడడానికి కనువైనవే. రచనలో శబ్దప్రయోగంతో జరిగే విరుపులు, శబ్దాల పొందికను బట్టి పాడడానికి అనుకూలం కావడం, కాకపోవడం జరుగుతూ వుంటుంది. అంటే పాడడానికి వీలు లేదనుకునే సీసాలు, తేటగీతి, ఆటవెలదులవంటి వాటిని— "చావు శవంవలె నడక లేకుండా పడివుంటాయి" అనిపించే అక్కరలు, మధ్యాక్కరాదులనుకూడా గానంచేయడానికి వీలుగా రచియించవచ్చునన్నమాట! శబ్దజ్ఞుడైన వ్యక్తి తాళ లయల మర్మం తెలుసుకుని తదనుగుణంగా తగు విరుపు

---

* కవిజనాశ్రయానికి తరువాతి కాలాలలో లక్షణ గ్రంథకర్తలు కొందరు పద్యగేయాలు భిన్న వర్గాలకు చెందినవి-అంటే—గద్య-పద్య-గేయ రచనలుగా పేర్కొనదగినట్టివి అన్న ధోరణిలో జాతి భిన్నత్వాన్ని ప్రదర్శించారు. ఈ ప్రదర్శనగురించి విషయ విస్తర భీతిచేత స్థల సంకోచంచేత యిక్కడ చర్చించటంలేదు.

ంతో శబ్దప్రయోగం చేసి, రచన చెయ్యాలనేటప్పుడు అతని శక్తి యుక్తులమీద ఆధారపడే యిటువంటి రచనలు ఆవిష్కృతాలవుతాయి. శబ్దాల విరుపుల భేదాతో రాగతాళలయలకవకాశం వుంటుందన్న వివక్ష శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారి దృష్టికి రానందువల్ల కాబోలు "శార్దూలము, చంపకమాల మొదలైన వృత్తాలన్నియు రాగపుష్టిగాని, తాళలయములు చూపుగాని లేక వట్టి గురు లఘువుల ప్రస్తారములే యేర్పడినవి" అని పేర్కొన్నారు. పాడడం, చదవడం అనేవి శబ్దాలకు సంబంధించి తాళలయస్ఫూర్తికైన రాగానుగుణంగా నడచే విరుపులతో కూడిన రచనపై సాధారణంగా ఆధారపడి వుంటుంది. చదవడం వేరు, పాడడం వేరు. పద్యాన్ని చదవడానికి రాగతాళలయలక్కరలేదు. పాడడానికవి వుండితీరాలి. శ్రీరాగంలో పద్యం పాడాలంటే పద్యానికి—పద్యగాన సమయానికి తగినట్లుగా పాడమనేగాని, విధ్యుక్తంగా పాడమనికాదు. శ్రీరాగాన్ని ఆరోహణావరోహణలతో పరిపూర్ణంగా ప్రస్తరించి పాడితే ఎంతకాలం పడుతుందో అంతకాలమూ, అంతగా ఆ రాగాన్ని సాగలాగి పద్యం పాడమని చెప్పడంకాదు. పద్య గాన సందర్భంగా, రాగాలాపనలో పూర్ణకాలాన్ని ఉపయోగించాలనడం, ఛందః ప్రస్తారంలో సర్వగుర్వాది సర్వ లఘ్వంతంగా పూర్ణప్రస్తారం అయితేనే తప్ప పద్య లక్షణం – గురు లఘువ్యవస్థ పూర్తి కాదని చెప్పడంవంటిదే కాగలదు. పాటలైనా, కేవలం పాడాలనేలేదు. పద్యాన్ని చదవనూవచ్చు పాడనూవచ్చు అన్నట్లుగా, పాటను కూడా పాడనూవచ్చు చదవనూవచ్చును. ఈ విషయం సంకీర్తనాలక్షణ కారులందరికీ నిత్యానుభవంలో తెలిసిందేఅయినా ఎవరూ పట్టించుకున్నట్లు కనబడదు. ఇంతవరకూ పాటపాడాలనే అంటున్నా, పాటచదవవచ్చునన్న మాటను అందరూ విస్మరించారనే చెప్పవచ్చు. వాల్మీకిరామాయణం, "పాఠ్యేగేయేచ మధురం" కదా ! ఒక్క రామాయణాన్నే కాదు దేన్నయినా పాఠ్యేగేయేచ మధురంగా మనం చదవనూవచ్చు. పాడనూవచ్చు. పాటపాడడం సాహిత్యసంగీతాల సమ్మేళన దృష్టితోను, లేదా కేవల పూర్ణ సంగీత దృష్టితోనూ జరగవచ్చు. చదవడం సాహిత్యభావ శబ్దాది లక్షణ వివేచనాత్మకమయిన దృష్టితోను, లేదా సంగీతదృష్టి తోను-అంటే రాగతాళలయ లక్షణ వివేచనాత్మకమయిన దృష్టితోను-జరుగవచ్చు.

## పద కవిత

పదకవిత అంటే చాలాకాలంగా కీర్తనలు, గేయాలువంటి కవితమాత్రమే నన్నభావం పండిత విమర్శకుల్లో పొరపాటుగా ఏర్పడివున్నది. పదకవిత అనగా సరియైన అర్థ మేమిటో తెలుసుకునేముందు, పదశబ్దార్థాదులు కూడా మనం తెలుసుకోవడం అవసరం. అసలు 'పద' శబ్దార్థంగురించి పరిశోధకులు లోతుగా సమన్వయ దృక్పథంలో చూచినట్లు కనపడదు. పదశబ్దానికి—"చిహ్నం (గురుతు)— వంచన — కళాస్థానభేదం—పాదం (అడుగు—కాలు)— (పదన్యాసం — అడుగుతీసి అడుగువేయడం)—వ్యాజం (నెపం)—స్థలం—రక్షణ— కిరణం—ప్రయత్నం—ఉద్యోగం—సుబంత తిఙన్తశబ్దాలు — బాణం — పదార్థం (వస్తువు) — పీటకోడు—వాక్యం— కాలిఅడుగుజాడ — పాట" అని అర్థాలు వున్నట్లు నిఘంటువులు

పేర్కొంటున్నాయి. కవితకు సంబంధించినంతవరకూ, పదశబ్దానికి కాలు—అడుగు—పాదం (అంటే పద్యభాగం—చరణభాగం) అన్న అర్థాన్నే యిప్పటివరకూ విమర్శకులు స్వీకరించారు. పదం అంటే పాదం—కాలిఅడుగు అన్న అర్థదృష్టితో—పదశబ్దాన్నే పురస్కరించుకుని నృత్యపరమైన "అడుగు" (కాలిచిందు) అన్న అర్థాన్ని మేళవించి పాటలు నృత్యసంబంధమయినవి కాబట్టి "పదము" అన్న శబ్దానికి 'పాట'—గీతం—గేయం—కీర్తన అని అర్థం చెప్పుకున్నారు. పాదమంటే నేలమీద ఆనే కాలిఅడుగు, వేళ్లు, మడమ, మడమకు పైగా కొంత సమానంగా ఎత్తుగా కాలివ్రేళ్ల పైభాగంవరకూవుండే ప్రదేశాన్ని పాదం అంటాం. ఈ పాదాన్ని (కాలిభాగాన్ని) పదం అనికూడా అనవచ్చు. పదమంటే శబ్దం అని ఒక అర్థం ఉన్నదని లోగడ గుర్తించాం. ఇక్కడ ఒక విచిత్రం ఉన్నది. పదశబ్దం పాదశబ్దానికి పర్యాయపదమేకాని. పాదశబ్దం పదశబ్దానికి పర్యాయపదంకాదు. పాదశబ్దానికి ఎన్నిఅర్థాలున్నాయో అన్నింటిని, పదశబ్దానికి మనం చెప్పవచ్చు. కాని పదశబ్దానికున్న అర్థాలన్నింటినీ, పాదశబ్దానికి చెప్పరాదు. ఉదాహరణకు, పదశబ్దానికి, శబ్దం (సుబంతం, తిఙన్తం) అని అర్థం ఉన్నది. కాని "పాద" శబ్దానికి శబ్దం (సుబన్తం, తిఙన్తం) అని అర్థం చెప్పరాదు. ఇదే యిక్కడ వున్న విచిత్రం. పదవాక్య సంబంధమైనదే, అంటే శబ్దవాక్య సంబంధమైనది అన్న అర్థంలో "పాదం" అని సంబంధార్థకంగా వాడవచ్చును.

విశిష్ట ప్రకృష్టతంతో విశేషంగా పదశబ్దం ప్రయోగించబడిన సందర్భాలు సుప్రసిద్ధంగా సంస్కృతంలో ఒకటి తెలుగులో ఒకటి మొత్తం రెండు కనిపిస్తున్నాయి. శ్లేష.కావ్యాలలో ఎక్కడైనా ప్రయోగింపబడితే ప్రయోగింపబడి వుండవచ్చు. కాని యిప్పుడు పేర్కొంటున్న రెండు ప్రయోగాలకు దక్కినంత వైశిష్ట్యం అన్నింటికీ దక్కుతుందనుకోలేం. కాళిదాసు కుమారసంభవంలో పంచమసర్గలో పార్వతి శివుణ్ణి పతిగా కోరి ఫలసిద్ధికై తపస్సు చేస్తుంది. ఆమె తపస్సుకు సంతుష్టుడైన శివంకరుడు బ్రహ్మచారివేషంలో ఆమెవద్దకు వెళ్లి సత్కారాలు స్వీకరించి చల్లగా యిలా అంటాడు.

ప్రయుక్త సత్కార విశేష మాత్మనా
నమాం పరం సంప్రతిపత్తు మర్హసి
యతః సతాం సన్నతగాత్రి ! సంగతం
మనీషిభిస్సాప్తపదీన ముచ్యతే ॥

ఇందులో "సంగతం మనీషిభిస్సాప్తపదీన ముచ్యతే" అన్నాడు బ్రహ్మచారి ద్వారా కాళిదాసు – "సాప్తపదీన" మనడంలో "పద" శబ్దంచేత శబ్దం–వాక్యం–కాలి అడుగు– అన్న మూడు అర్థాలూ పరిగృహీతాలు కావాలన్న దృష్టి కాళిదాసు

వున్నది. మనిషులతో యేడడుగులు కలిసి నడిచినా - (అంటే యేడడుగులు వేసినా) యేడుమాటలు మాట్లాడినా — యేడువాక్యాలు * మాట్లాడినా స్నేహం యేర్పడుతుందని కాళిదాసు భావం - యీ సందర్భంలో కాళిదాసు "పద" శబ్దాన్ని మాట - వాక్యం అన్న అర్థాలతోను "కాలిఅడుగు" అన్న అర్థంతోనూ ప్రయోగించాడు.

కవిజనాశ్రయకర్త సంజ్ఞాధికారంలో రెండవ పద్యాన్ని యీ క్రింది విధంగా రచించాడు.

క. యతి గణముల పాదాం
బురుహంబుల కెఱఁగి సుకవి బుధజనముల నా
దరమునఁ దలఁచి తదాజ్ఞం
బరహిత చరితుఁడు జినేంద్ర పదభక్తి మెయిన్.

ఇందులో చివరిపాదంలో వున్న "పదభక్తి" లోని పదశబ్దం గురించి పెద్దగా పట్టించుకోవలసిందేమీలేదు. కావాలనుకుంటే యిక్కడా శ్లేషార్థం చెప్పవచ్చు - యేదోవిధంగా సరిపెట్టుకోవచ్చు — కాని తొలిపాదంలోని "పాదాంబురుహంబుల" అన్నప్పుడు మనం గుర్తించవలసిన విశేషం వున్నది. ఛందోపరంగాచూస్తే గురు = ద్విమాత్రా రూపమైన గురువు, యతి - యతి = అక్షరమైత్రి - గణముల=మగణాది గణముల—పాదాంబురుహంబులకు = పద్యపాదపద్మాలకు - ఎఱఁగి = నమస్కరించి అని అర్థం వస్తుంది. ఈ ఛందోపరమైన అర్థంలోనే గురుయతిగణములతో కూడిన "పాదాంబురుహంబులకు = శబ్దసంబంధమైన — లేదా — వాక్యసంబంధమైన పద్మాలకు అనికూడా అర్థం వస్తుంది. మామూలుగా చూస్తే గురు = విద్యనేర్పిన గురువుల యొక్కయు, యతి = మునీశ్వరులయొక్కయు, గణముల = సమూహముల, పాదారవిందములకు = పాద పద్మాలకు (కాళ్లకు) ఎఱఁగి = నమస్కరించి అని అర్థం వస్తుంది. ఇక్కడ గురుశబ్దానికి తండ్రి అని గొప్పవారు అని కూడా అర్థం చెప్పవచ్చు.

కాళిదాసు "పద" శబ్దాన్ని మాట-వాక్యం-కాలి అడుగు అన్న మూడర్థాలతో ప్రయోగించగా కవిజనాశ్రయకర్త "పాద" శబ్దాన్ని శబ్ద సంబంధమైన - వాక్యసంబంధమైన - కాలిఅడుగు - పద్యపాదం - అన్న నాలుగర్థాల్లో ప్రయోగించాడు.

పాల్కురికి సోమన "ఐహికాముష్మికద్విపద హేతువగుట ద్విపదనాబరగు" అని విశిష్టంగా పేర్కొన్నా అది కేవలం అభిమాన పురస్కృతమైనదే - ద్విపద ఐహికాముష్మిక ద్విపద హేతువవడానికి శాస్త్రీయత కనిపించదు. ఈ దృష్ట్యా ఆలోచించినప్పుడు—"త్రిపదా" దులఫలితమేమిటో పేర్కొనవలసివస్తుంది. కాగా సోమన భావం తర్క సహంకూడా కాదు.

---

* "పద" శబ్దానికి వాక్యం అనికూడా అర్థం వున్నది.

ఛందశ్శాస్త్ర దృష్టితో చూచినపుడు కొట్టవచ్చినట్లు మనకు పదశబ్దం కనిపించేది ద్విపద-త్రిపద-చతుష్పద- (చౌపద) షట్పదివంటి వాటిల్లో. అతి ప్రాచీన కాలంనుంచి కూడా అంటే క్రీ॥ శ॥ 11 వ శతాబ్దం పూర్వంనుంచీ కూడా ద్విపదాదులు దేశీయ ఛందస్సులన్న భావం ఏర్పడి ఉన్నది.

> గాయత్రీ త్రిష్టుబ్ జగత్యనుష్టుప్పఙ్క్త్యా సహ ।
> బృహత్యుష్ణిహా కకుప్సూచీభిః శమ్యన్తు త్వా ॥
> ద్విపదాయాశ్చతుష్పదాస్త్రిపదాయాశ్చ షట్పదాః ।
> విచ్ఛన్దాయాశ్చ సచ్ఛన్దాః సూచీభిః శమ్యన్తు త్వా ॥

అంటూ యజుర్వేదం 23వ. అధ్యా 33-34 మంత్రాలలో ఛందస్సులూ ద్విపదాదులూ పేర్కొనబడ్డాయి. కాగా ద్విపద-త్రిపద-చతుష్పద-షట్పదులు దేశీయఛ్ఛందాలనుకోవడం సరికాదన్నమాట. గాయత్ర్యాది ఛందస్సులను పేర్కొన్న మంత్రానికి తరువాతి మంత్రంలోనే ద్విపదాదులు పేర్కొనడంవల్ల అసలవి దేశీయాలు కావని అసందిగ్ధంగా చెప్పవచ్చునన్నమాట. ప్రస్తుతోదాహరణ లను బట్టి పదశబ్దం వేదకాలంలోనే సాంకేతిక పదంగా పాదార్థంలో ప్రయోగింప బడిందని ఆమోదించక తప్పదు*. వేదకాల నిర్ణయంలో అభిప్రాయభేదాలున్నా సంస్కృత భాషకుగాని ఆర్షవాఙ్మయానికిగాని విశ్వాసపూర్వకంగా చూచినా-చారిత్రకంగా చూచినా వేద వాఙ్మయం తొట్టతొలిరచన అన్న సంగతి నిర్వివాదాస్పదమైన విషయం. మరి తొలిసంస్కృత రచనలోనే ద్విపదాదులకు స్థానం లభిస్తే అవి సంస్కృత భిన్నమైన దేశీయ ఛందస్సులని మనం యేవిధంగా భావించ గలం? ఇక్కడ మనం గుర్తించవలసింది మరొక విశేషముంది. ద్విపద-త్రిపద-చతుష్పదలలో "పద" శబ్దమే మనకు లక్షణగ్రంథాలలో కనిపిస్తుంది. "షట్పద"ను మాత్రం "షట్పది"గా లక్షణకారులు వ్యవహరించారు. "ద్విపదాదుల్లో" పద శబ్దమే వాడినపుడు "షట్పది" అన్నప్పుడు మాత్రం పదశబ్దంతో "షట్పద" గా ఎందుకు వ్యవహరించకూడదు? యజుర్వేద మంత్రంలో అన్నింటిలోను "పద" శబ్దమే వాడబడింది. లాక్షణికులు షట్పదిగా వ్యవహరించడాన్ని అప్రామాణిక మని మనం త్రోసిపుచ్చలేము. త్రోసిపుచ్చ నవసరం లేదుకూడా. ఈ పద్ధతిలో "అష్టపది" ని "అష్టపద" గా పేర్కొన్నా నిర్దుష్టమే కాలేదు. అయితే యీ దృష్ట్యా ద్విపదాదుల్లో కూడా ఇత్వసహితమైన "పది" శబ్దాన్ని వుపయోగించి "ద్విపది"- "త్రిపది" -"చతుష్పది" అని కూడా మనం ప్రయోగించుకోవచ్చునని ఆమోదించకతప్పదు. ఇటువంటి ప్రయోగాలు చేయడంలో విచ్ఛేదనష్టమూలేదు. ఉండే దోషమూలేదు. ("ద్విపది" గురించి "మార్గ-దేశి" అన్న నా రచనలో వివరించాను.)

భరతుడు నాట్యశాస్త్రంలో చతుర్దశాధ్యాయంలో కవిత గురించి యీ క్రింది విధంగా వ్రాశాడు.

---

* ద్విపదాదులలో ఉపయోగించబడిన శబ్దం "పద" శబ్దమా లేక "పథ" శబ్దమా అన్న సందేహానికి ఆస్కారమిస్తూ "ద్విపథ" అని శార్ఙ్గదేవాదులు తమ రచనల్లో ప్రయోగించారు. దీన్నిగురించి ముమ్ముందు చర్చించడం జరుగుతుంది.

ఏభిః శబ్ద విధానై ర్విస్తార వ్యంజనార్థ సంయుక్తైః।
పదబంధాః కర్తవ్యా నిబద్ధ బంధాస్తు చూర్ణావా॥
విభక్త్యంతం పదం జ్ఞేయం నిబద్ధం చూర్ణమేవచ।
తత్రచూర్ణ పదస్యేహ సంవిబోధత లక్షణమ్
అనిబద్ధపదం ఛందః తథాచా నియతాక్షరమ్॥
అర్థాపేక్ష్యక్షరస్యూతం జ్ఞేయం చూర్ణపదం బుధైః॥
నిబద్ధాక్షర సంయుక్తం యతిచ్ఛేద సమన్వితమ్।
నిబద్ధంతు పదం జ్ఞేయం ప్రమాణ నియతాత్మకమ్॥
ఏవం నానా సంయుక్తైః పాదై ర్వర్ణ విభూషితైః।
చతుర్భి స్తథ వేద్యుక్తం ఛందోవృత్తాభిధానవత్॥
షడ్వింశతిః స్మృతాన్యేభిః పాదైశ్ఛందాంసి సంఖ్యయా।
సమమర్థ సమంచైవ తథా విషమమేవచ॥
ఛందోజ్ఞేయం సమాసేన త్రివిధంవృత్తమిష్యతే।
నానావృత్త వినిష్పన్నా శబ్దస్యైషాతునుస్మృతా॥
ఛందోహీనో నశబ్దోఽస్తి నఛందశ్శబ్ద వర్జితమ్।
ఏవంతూభయ సంయోగో నాట్యస్యోద్యోతకస్స్మృతః॥

"ఛందస్సు లేకుండా శబ్దం లేదు. శబ్దం లేకుండా ఛందస్సూ లేదు." అని వున్న యదార్థాన్ని చెప్పిన భరతుడు కవితను నిబద్ధమని, చూర్ణమని రెండు విధాలుగా పేర్కొన్నాడు. నిబద్ధం ఛందోబద్ధమవుతుంది. కాబట్టి నిబద్ధ కవితను ఛందోబద్ధమనవచ్చును. అయితే భరతుడు అనిబద్ధపదయుక్తమైన అనియతాక్షర కవితను కూడా అంటే చూర్ణాన్ని లేదా గద్యను కూడా ఛందస్సనే పేర్కొన్నాడు. ఛందశ్శబ్దాలకు అవినాభావ సంబంధమున్నదని వక్కాణించిన భరతుడు గద్యం ఛందస్సు కాదని యెలా అంటాడు? పది అక్షరాలుండ నక్కరలేదు. నాలుగు మాటలుండనక్కరలేదు. రెండు మూడక్షరాలైనా ఛందోబద్ధమే. ఒకే ఒక అక్షరమైనా ఛందోబద్ధమే. అయినప్పుడు గద్య ఛందోబద్ధం కాదంటే యెలా చెల్లుతుంది? అందుకే భరతుడు గద్యకూడా ఛందోబద్ధమేనని అభిప్రాయం వెల్లడిసూ అయితే అది నియతాక్షరాలు లేనిదీ అనిబద్ధపదం కాబట్టి పద్యం కాదన్నాడన్నమాట. అందువల్లనే "అనిబద్ధపదం ఛందః తథాచానియతాక్షరమ్" అన్నాడు. అసలు కవిత అది పద్యరూపమైనదైనా, గేయరూపమైనదైనా పదమన బడుతుందని భరతుడే తొట్టతొలుత స్పష్టంగా చెప్పాడు. విభక్త్యంతం పదం. కవిత పద (శబ్ద) సంకలితమై ఆవిష్కృతమౌతుంది. కాబట్టి "పదసంకలితమైంది" పదం అనబడింది. పద శబ్దానికి వాక్యం అని కూడా అర్థం వున్నదని గతంలో గుర్తించాం. పద సంకలితమైంది వాక్యం కాబట్టి పదమనబడింది. పదాలతోనిబద్ధమైంది–పదమయమైన పదాలతో–అంటే వాక్యాలతో–నిబద్ధమైంది "నిబద్ధ పదం" అన బడింది.అంటే సమ–అర్థసమ–విషమవృత్తాలలోఏదైనా కావచ్చు గేయమైనాకావచ్చు నన్నమాట. గద్యాన్ని ఒక వంక చూర్ణమంటూనే–కేవలం చూర్ణమనే అనలేదు–

చూర్ణపదమని కూడా అన్నాడు భరతుడు-మరోవంక అనిబద్ధపదంగా పేర్కొన్నప్పుడు నిబద్ధమైన కవితను పద్య గేయాల్లోదేనైనా నిబద్ధపదమంటే దోషమెలా ఔతుంది? ప్రమాణ నియతాత్మకమైన పాదాలతో కూడినది ఏదైనా నిబద్ధపదమన్నాడు భరతుడు. ఈ నిర్వచనంలో సమ-అర్ధసమ-విషమాది వృత్తాలు గేయాలన్నీ అంతర్లీనమైపోతాయి. భరతుని నిర్వచనం ప్రకారం చూస్తే పద్యాలైనా గేయాలైనా పదమనవచ్చునని స్పష్టపడుతున్నది. మరి అనేక మంది ఆధునికులు భావించినట్లు పదమంటే గేయమని- అదికూడా నృత్యపరంగా కాలి అడుగుకు సంబంధించి పాదపరమైన సాంకేతిక పదంగా రూపొందిన శబ్దమని అనుకోవడం సరికాదన్నమాట, పద (శబ్ద) బద్ధమై రూపొందుతుంది కాబట్టి పదమనబడిందన్న భరతుని నిర్వచనం చాలా సార్థకంగా వున్నది.

క్రీ॥ శ॥ 13వ శతాబ్దంలో వున్న శార్ఙ్గదేవుడు సంగీతంలో అమోఘమైన పరిశ్రమ చేశాడు. అతని పరిశ్రమకు "సంగీతరత్నాకరః" అన్న లక్షణగ్రంథం ప్రతిబింబం. భరతుడు నాట్యశాస్త్రంలో కవిత గురించి ప్రత్యేకించి పదం గురించి చెప్పిన దానినిశార్ఙ్గదేవుడు గుర్తించినట్లే కనిపిస్తున్నది. కాని ఛందశ్శాస్త్ర విషయాలలో-వాటిస్వరూప స్వభావాల వివేచనలో ఎక్కువగా శార్ఙ్గదేవునికి అనుభవం వున్నట్లు కానరాదు. అంతేకాదు అతని కాలంలో ఆంధ్రకవిపండితలోకంలో మార్గ-దేశిపరమైన అభిప్రాయభేదాలూ-అభిమాన నిరభిమానాలూ-బాగా తలెత్తాయి-కాగా సత్యాన్వేషణాపరతత్వం-పూర్ణమైన శాస్త్రపరిజ్ఞానం లేనందువల్ల మార్గచ్ఛందస్సు అనుకునే వృత్తాలను కొందరభిమానించి దేశీయాలనుకునే ఛందస్సులను చులకనగా చూడడం జరిగింది. దేశిచ్ఛందస్సు మార్గచ్ఛందస్సుతో సమానమైనదేనని సమర్థించుకుంటూ కొందరు రచనలు కొనసాగించారు. గేయాలన్నవి సామాన్యంగా దేశిపరాలవుతాయి కాబట్టి యీ మార్గ-దేశిపక్షాలలో సంగీతజ్ఞులకత్యంతావశ్యకమైన గేయ వాఙ్మయం కూడా హేయ ప్రాయమై-మార్గ-మార్గగాయకులచేత చిన్నచూపు చూడబడినట్లు స్పష్టపడుతున్నది. యిటువంటి పరిస్థితుల్లోనే శార్ఙ్గదేవుడు అగాధమైన తన సంగీతశాస్త్ర పరిజ్ఞానంతో యీ సంగీత రత్నాకర గ్రంథాన్ని మహోదారంగానే నిర్మించాడు.

తన సంగీతరత్నాకరంలో "ప్రబంధాధ్యాయ" మన్న పేరుగల నాలుగవ అధ్యాయంలో శతాధికాలైన ప్రబంధాల గురించి పేర్కొన్నాడు. భరతునిలాగనే ప్రబంధం గద్యపద్యాత్మకంగా రెండు విధాలన్న భావాన్నే వెల్లడించాడు, అయితే ఛందస్తాలాది నియమాలతోకూడిన రచనను "నిర్యుక్త ప్రబంధం" అనీ ఛందస్తాలాది నియమాలులేని రచనను "అనిర్యుక్త ప్రబంధ" మనీ యీ క్రింది విధంగా పేర్కొన్నాడు.

అనిర్యుక్త స్సనిర్యుక్తః ప్రబన్ధో ద్వివిధో మతః ।
ఛన్దస్తాలాద్యనియమాదనిర్యుక్తో నియమాత్పరః ॥

ఈ లక్షణం చెప్పడానికి పూర్వం గీత, గాన, ధాతు భేదాలు వివరించి ప్రబంధాంగాలు పేర్కొన్నాడు. గానం కూడా "నిబద్ధం-అనిబద్ధం"అని ద్వివిధంగా స్పష్టపరిచాడు. ప్రబంధాంగాలు చెప్తూ

ప్రబంధోఽంగానిషట్ తస్య స్వరస్తు కథితం పదమ్ ।
తేనకః పాట తాలౌచ ప్రబన్ధ పురుషస్మృతే ॥

అని "పదం" షడంగాలలో ఒకటన్నాడు. అయినా "పద" శబ్దాన్ని భిన్న భిన్న సందర్భాల్లో ప్రయోగించాడు. "వీర శ్రీ ప్రబంధం" గురించి చెప్తూ

పదైశ్చ బిరుదైర్బద్ధా
వీర శ్రీరితి గీయతే ।

అన్నాడు - ఆ వెంటనే "మంగలాచరణ" ప్రబంధం గురించి చెప్తూ

యస్తుగద్యేనపద్యేన గద్యపద్యేన వాకృతః ।
కైశిక్యా మంగలాచారః సనిస్సారుః స్వరాన్వితః ॥

అన్నాడు-శుద్ధ పంచమ కైశికీ రాగంలో గానం చెయ్యాలిగిన రచన గద్యేన పద్యేన - గద్యపద్యేన వాకృతః - గా అవతరించాలనడంలో "పద్య" శబ్దాన్ని కేవల "వృత్త" పరంగానేకాక దేశి ఛందస్సులనబడే పద్యాల పరంగానేకాక - "పద" పరంగా - అంటే - పాటపరంగాకూడా ప్రయోగించాడని స్పష్టపడుతున్నది. వివిధ దేశభాషల్లో గానం చెయ్యబడే "ఓవీ ప్రబంధా" ల గురించి చెప్తూ వీనికి మూడు చరణాలుంటాయని (త్రయాణాం చరణానాంస్యుః) అంటూ

ఆదిమధ్యాన్తమేషుప్రాసైకేకాద్యోచ్చ పదేపదే
ఛందోభిర్బహుభిర్గేయా ఓవ్యోజనమనోహరాః ॥

అన్నాడు - "ఓవీపదంతపస్తే" అని ఓవిని పదంగా పేర్కొంటూనే - ఆది - మధ్య - అంత్యప్రాసలు ప్రతిపాదంలోనూ వుంటాయని - అంతటితో ఆగక "ఛందోభిర్బహుభిర్గేయా" అన్నాడు. ఈ "ఓవీపద"మైనా ఏకైక ఛందోబద్ధం కాని బహు విధాలైన ఛందస్సులలో బద్ధమవుతున్నది శార్ఙ్గదేవుడు విస్పష్టంగా ప్రకటించాడు. అంటే "ఓవీపదం" యేఛ్ఛందస్సుల్లో బద్ధమైనదైనా "పద" మేనన్నమాట.

దేశీపదాలనబడిన పెక్కు పదరచనా ప్రబంధాలను, ప్రత్యేకించి మార్గత్వాన్ని రచనా పరంగా పేర్కొనక పోయినా మార్గరచనా ప్రబంధాలను కూడా శార్ఙ్గదేవుడు వివరించాడు. అయితే గతంలోనేను పేర్కొన్నట్లు సునిశితమైన ఛందశ్శాస్త్ర పరిజ్ఞానం - ఛందశ్శాస్త్రంతో సంగీత శాస్త్రానికున్న అవినాభావ సంబంధాన్ని గుర్తించే విమర్శా పాటవం కొరవడినందువల్ల కాబోలు - "పద" నిర్వచన విషయంలోను - ప్రబంధ లక్షణాలను నిర్వచించడంలోను - క్రమమైన - సూత్రబద్ధమైన - అజేయమై తర్కసహమైన విషయ వివేచనా రాజమార్గాన్ని యేర్పరచుకో లేకపోయాడు. పదాలన్నీ (పద్యాలు - గేయాలు యేవైనా) చదవడానికి పాడడానికి వీలైనవేనన్న శాస్త్రీయ విషయాన్ని శార్ఙ్గదేవుడు పూర్తిగా గుర్తించక పోయినా లీలగా గుర్తించినట్లే కన్పిస్తున్నది. ద్విపథ ప్రబంధం గురించి చెప్తూ

ఛన్దసా ద్వి పథేనస్యాద్ ద్విపథః స్వరముక్తికః।
తాలహీనః సతాలో వా సచజ్ఞేయశ్చతుర్విధః॥

అన్నాడు. "ద్విపథ ప్రబంధం" – "తాలహీనః సతాలోవా" అవుతుందంటున్నాడంటే దీన్ని తాలరహితంగా చదవనూవచ్చు – తాల సహితంగా పాడనూ వచ్చునని ఘంటాపథంగా ఘోషిస్తున్నాడన్నమాట. ఈ ఛందస్సు పేరు "ద్విపథ" అన్నాడు. సంస్కృతంలో వున్న అక్షరగణ సమవృత్తాల్లోని "తోధక" (కొందరు దీన్ని దోధకం – దోదకం – తోదకంగా కూడా వ్యవహరించారు.) వృత్తాన్నే "ద్విపథ" అన్నారని కొందరు భావించారు. మామూలుగా మనం దేశీయ చ్ఛందస్సుగా భావించి లక్షణం చెప్పుకుంటున్న "ద్విపద" కు మూడింద్రగణాలు ఒక సూర్యగణం వుంటుంది. మాత్రల లెక్కింపు దృష్ట్యా చూస్తే ద్విపదలో మాత్రలు యే గణాలు ప్రయోగించినా పాదానికి 15 – 18 సంఖ్యలమధ్య పరిమితిలో నిబద్ధమై వుంటాయి. "తోధక" వృత్త లక్షణాన్ని దృష్టిలో పెట్టుకుని మాత్రాగణనపద్ధతిలో పరిగణిస్తే పాదానికి 16 మాత్రలుంటాయి. వివిధేంద్ర సూర్యగణాలతో ద్విపదలు విభిన్నాలుగా రచించి చూస్తే ఆయా ద్విపదలలో దేనికైనాసరే "త్రిష్టుప్ – జగతి – అతిజగతి – శక్వరి – అతిశక్వరీ చ్ఛందాలలో దేనిలోనో ఒకదానిలో స్థానం లభించి తీరుతుంది. అంటే మనం దేశి అనుకొనే ద్విపద మార్గచ్ఛందస్సులోదే అవుతుందన్నమాట. పూర్వ ఉత్తరపాదాలలో అక్షరమాత్రా భిన్నత్వం యేర్పడితే అవి విషమవృత్తాలుగా రూపొంది యీచ్ఛందస్సులకే సాంకర్యంతో ప్రాతినిధ్యం వహిస్తాయని మనం గుర్తించాలి. ఏమైతేనేమి ద్విపద – ఒక్కద్విపదేకాదు – సరంలో పేర్కొన్నట్లు ద్విపదాదులన్నీ దేశీయతా వైశిష్ట్యం కలవికావు. *

మరింత స్పష్టం కావడానికై ఒక పద్యంపేర్కొని వివరిస్తాను.

వీరభావ భాసస్త్వ విద్యుజారివారహా
హారవారి జారికీర్తి హారితా సుధీసా
(చ. ఆ–25రప.)

ఇత్యాదిగా చంపకబంధంగా ఇందుమతీ పరిణయంలో ఒక పద్యంవున్నది – మాత్రాచ్ఛందోబద్ధంగా దేశిగా భావింపబడుతున్న ఉత్సాహలక్షణం దీనికి సరిపోతుంది. అసలు కావ్యంలో ఉత్సాహంగానే పేర్కొనబడింది. ఏడు సూర్యగణాలు ఒక గురువుఉండి నాల్గు గణాలతరువాతయతిఉంటే ఉత్సాహ. ఈ లక్షణం పై పద్యానికి సరిపోతుంది. అయితే మార్గ చ్ఛందస్సు దృష్టిలో—పాదానికి 15 అక్షరాలుండె అతిశక్వరీచ్ఛందంలో ర, జ, ర, జ, ర గణాలతో ఉండే సుగంధి వృత్తలక్షణానికిది లక్ష్యం అవుతుంది – ఈ సుగంధికి శాంతి – ప్రశాంతి – చామరం అన్న వివిధ నామాలున్నాయి – దీనికి తొమ్మిదవ అక్షరం యతి – దేశిగా భావించిన ఉత్సాహ లక్షణానికి సరిపోయిన పై పద్యం సంస్కృత చ్ఛందంలో సుగంధి వృత్తలక్షణం కలదే. అయితే ప్రతి ఉత్సాహమూ సుగంధి కానేరదు – ఏడుహాగణాలు గురువుకలదే

* ఈ పద్ధతిలోనే త్రిపద–చతుష్పద–షట్పదులు వివిధ చ్ఛందస్సుల్లో అంతర్లీనమవుతాయి.

సుగంధికి సరిపోతుంది – నగణం మిశ్రితమైతే సుగంధి కానేరదు – అప్పుడు మరొక ఛందంలో మరోవృత్త మవుతుంది.

రెండుపాదాలుకలది కాబట్టి "ద్విపద" ను "ద్విపద" అనడమే వుత్తమంగా ఉంటుంది. ఈ సంఖ్యాపరిమితి "ద్వి" వరకే లేదుగదా ! "త్రిపద–చతుష్పద – షట్పద" లతో ఆ హద్దుమీరింది గదా ! (సామాన్యంగా పద్యాలన్నీ చతుష్పదలనే విషయం వేరు). కాగా పాదసంఖ్యాపరిమితి కారణంగానే యిటువంటిపేర్లు యేర్పడ్డాయనుకొనడమే సముచితం. అంతేకాదు. "సతాలం– తాలహీనం" అవడంవల్ల "ద్విపథ" అన్న నామం వచ్చిందన్నట్లు శార్ఙ్గదేవుడు పేర్కొన్నాడు గాని యిందులో తర్కసహమైన యధార్థంకాని, వస్తుస్థితిని ప్రతిబింబించే యధార్థంకాని లేదు. తాల సహితంగా– తాలరహితంగా యే ఛందస్సునైనా రచనలో మలచ వచ్చునని లోగడ పేర్కొన్నాను. ఈ దృష్ట్యాకూడా శార్ఙ్గదేవుని సతాల – వితాల "ద్విపథ" లో "థ" కారానికి స్థానం లేదు. దీన్ని కే చిన్మతంగా భావించినా ద్విపదీ ప్రబంధంగా శార్ఙ్గదేవుడు పేర్కొన్నది మరొకటి వున్నది. 5 భగణాలు ఒక గురువు దీని పాద సామాన్యలక్షణం. మాత్రాపరిగణనం దృష్ట్యా 22 మాత్రలు ఛందః పరంగా యేర్పడతాయి. కాగా దీనికీ దేశిద్విపదగా భావింపబడే దాని లక్షణానికీ సమన్వయం కుదురదు.

హయలీలా ప్రబంధం గురించి వివరిస్తూ
హయలీలేనతాలేన హయ లీలాద్విధాచసా॥
గద్యజా పద్యజా చేతి పద్య జాతుచతుర్విధా
పూర్వార్థముత్తరార్థం వా ద్వేవాతాలయుతం యది॥
ఆర్యాయాః స్యుస్తదాతిస్రశ్చతుర్థీత్వాదిమేదలే
స్వరేః పదైస్తు బిరుదైః సతాలై రచితామతా॥

అని గద్య పద్యజత్వాలను పేర్కొని చతుర్విధ పద్యజాలు కూడా "పదా"లే (పదైస్తు-రచితా) నన్నాడు. కంద ప్రబంధం గురించి పేర్కొంటూ

కర్ణాటాది పదైః పాఠై ర్విరుదైస్తాలవర్జితః।
ఆర్యా గీతొరసీ వీరొకందస్యాత్ పాటముక్తికః।

అన్నాడు. ఆర్యాగీత కందాల సంబంధాన్ని పేర్కొంటూనే చెప్పబడిన యీలక్షణంలో "కర్ణాటాదిపదైః" అన్నమాటను చూచి కంద ప్రబంధం సంస్కృత భిన్నమైన కర్ణాటాది దేశభాషా పదాలతో నిర్మింపదగిందన్న భావం అభివ్యక్తీకరింపబడిందని కొందరు భావించారు. ఇది సరికాదు. కర్ణాటాది దేశ భాషల్లో కందం వ్రాస్తే సంస్కృత సమ పదాలు ప్రయోగింపబడకుండా కేవలం అసంస్కృతపదాలే వాడాలన్న నియమం ఒక్క కన్నడ భాషలోనేకాదు యే దేశభాషలోకూడా లేదు. ఇక్కడ కూడా "పద" శబ్దానికి పద్యమనే అర్థంకాని వేరుకాదు.

గద్య ప్రబంధంగురించి చెప్తూ సంగీతరత్నాకరకర్త "గద్యంనిగద్యతే ఛందో హీనం పదకదంబకమ్। తత్షోఢోత్కలికా చూర్ణ ంలలితం వృత్తగంధిచ॥ అంటూ వివిధ భేదలక్షణాలు పేర్కొని "గద్యస్యషట్ ప్రోక్తాగతయః పూర్వసూరిభిః" అన్నాడు. గద్యాన్ని "ఛందోరహితమైన పదకదంబకం"అన్నాడంటే గద్యభిన్నమైన రచనను "ఛందోసహితమైన పదకదంబకం" అనవచ్చునన్న మాటేగదా! యింతగా యెందుకు వ్రాస్తున్నానంటే "పద" మంటే కేవలం గాన నిర్దేశకంగా మాత్రమే లాక్షణికులు కేవల సంగీత శాస్త్రకారులు కూడా వాడలేదనీ అవసరాన్నిబట్టి పద్యం, గేయం, యేదైనా గ్రాహ్యమేనన్న భావంతో నిర్వివక్షగానే ప్రయోగించారనీ చెప్పడానికే. అసలు శార్ ఙ్గదేవునికి ఛందశ్శాస్త్ర-సంగీత శాస్త్రాలకున్న అవినాభావ సంబంధం గురించి సమన్వయ పూర్వకమైన సమగ్రమైన అవగాహనలేదన్న విషయం సప్రమాణంగా నిరూపించి యీ చర్చముగిస్తాను.

తోటకచ్ఛన్దసాన్యస్తస్వరోఽజ్ ధ్యన్తేతు తోటకః।
సనువృత్తౌ వక్ష్యమాణే పునరుక్తోత్ర తోటకః॥
సత్యంకింతు మతౌయేషాం వృత్తం వృత్తాఖ్య వృత్తతః।
తన్మతే తోటకస్యేహనైవాస్తి పునరుక్తతా॥

వృత్తలక్షణం పునరుక్తమైతే "వృత్తాఖ్యవృత్త" మవుతుందని ప్రాచీనులు కొందరు పేర్కొన్నారు. ఈ పునరుక్తత్వం "తోటక" వృత్తానికి వర్తించదనీ-కాగా తోటకలక్షణం ద్విరుక్తంగా-అంటే స, స, స, స, స, స, స, స గణాలతో "వృత్తావృత్తం" వుండనేరదనీ వారు పేర్కొన్నారు. ఈ విషయాన్ని వున్నదాన్ని ఉన్నట్లు ప్రతిబింబించడంతోపాటు "తోటక ప్రబంధా"న్ని ప్రత్యేకించిపేర్కొనడంలో శార్ ఙ్గదేవుని పరిశీలనా పాటకం గురించి చాలా తక్కువగా అంచనా వేయకతప్పదు.

## వృత్తాఖ్య వృత్తత్వం సార్వత్రికం

అసలు వస్తుస్థితి పరిశీలిస్తే ఛందోవృత్తాలన్నీ-ఛందస్సుల పరంగా కూడిక తీసివేతలుగా రూపొందినవే.* ఉక్తాదిగా మొదలు పెడితే ప్రతిఛందమూ ఒకదానికి ఒకటిగా కలుపుకుంటే యేర్పడినదే. కాగా ఉక్తను రెట్టింపు చేస్తే-అంటే-పునరుక్తంచేస్తే అత్యుక్తరూపొందింది. అత్యుక్తను పునరుక్తంచేస్తే "ప్రతిష్ఠ" అవతరించింది. రెట్టింపు చేసిన ఆ మొత్తాన్ని తిరిగి రెట్టించుతూ ఆవిధంగానే రెట్టించడం పునః పునః చెయ్యాలి. ఛందస్సంఖ్య 26 కే పరిమితం కాబట్టి రెట్టించి కలిపితే 26 సంఖ్యను మించని సంఖ్యవచ్చే వరకే యీ కార్యం నిర్వర్తించాలి. దీనికి ఒక్కటే సూత్రంవున్నది. ఛందస్సులు 26 గదా! యీ 26 సంఖ్యలో సరి-బేసి సంఖ్యల్ని విడదీయాలి.

* ముందునుంచీ ఉక్తాదిగా అయితే కూడిక-చివరినుంచి-ఉత్కృతినుంచి-వెనక్కి వేస్తే తీసివేత- స్థలసంకోచంవల్ల యిక్కడ సవ్యమైన కూడిక పద్ధతే యివ్వడం జరుగుతున్నది.

బేసి— 1-3-5-7-9-11-13-15-17-19-21-23-25

సరి— 2-4-6-8-10-12-14-16-18-20-22-24

ఛందస్సులన్నింటికీ మూలమైనదీ తొట్టతొలిదీ 1 వ ఛందస్సుగదా! యీఒక్కటిని పునరుక్తం చేసి తిరిగిరెట్టించే కార్యక్రమాన్ని నిర్వర్తిస్తే ఏకాదిగా సరిసంఖ్యలున్న ఛందస్సులు 16 వరకూ రూపొందుతాయి.

1 + 1 = 2 + 2 = 4 + 4 = 8 + 8 = 16 + 16

ఈ విధంగా ఉక్తాదిగా రెట్టింపు చేయడంవల్ల (2) అత్యుక్త- (4) ప్రతిష్ఠ- (8) అనుష్టుప్- (16) శక్వరిచ్ఛందస్సులు యేర్పడతాయి.

ఏకాదిగా రెట్టించిన తరువాత- సరిసంఖ్యలుగల ఛందస్సులను ఉక్తకు అంటే ఒకటికి కలుపుతూ—అవకాశంవున్నంతవరకూ-పునరుక్తిగా కలుపుకుంటే సమస్త చ్ఛందస్సులూ వస్తాయి. దీనిప్రకారం ఛందస్సుల పట్టిక యీ క్రింది విధంగా రూపొందుతుంది.

1. -ఉక్త-ఉక్తను కలిపితే (1 + 1) (2) అత్యుక్త (4) ప్రతిష్ఠ- (8) అనుష్టుప్ (16) శక్వరి ఛందస్సులు యేర్పడతాయి.

3. —మధ్యమ—ఉక్త, అత్యుక్తలు (1 + 2) మేళనం అవడంవల్ల రూపొందే- 'మధ్యమను' (3) రెట్టింపుచేసితత్ఫలితాల్ని రెట్టిస్తే (6) గాయత్రి- (12) జగతి-(24) సంకృతి చ్ఛందస్సులు రూపొందుతాయి.

5. సుప్రతిష్ఠ - ఉక్త, ప్రతిష్ఠలు (1 + 4) కలవడంవల్ల యేర్పడింది. దీనిమీద (10) పంక్తి-(20) కృతిచ్ఛందస్సు లేర్పడతాయి.

7. ఉష్ణిక్ - ఉక్త, గాయత్రులు—(1 + 6) కలవడంవల్ల తయారయ్యిందిది. దీనిపైన (14) శక్వరీ చ్ఛందం రూపొందుతుంది.

9. బృహతి - ఉక్త, అనుష్టుప్‌లు (1 + 8) కలిస్తే యేర్పడిందేయిది. దీనివల్ల (18) ధృతిచ్ఛందం యేర్పడుతుంది.

11. త్రిష్టుప్ - ఉక్త, పంక్తులు (1 + 10) కలవడంవల్ల యేర్పడింది. దీన్ని పునరుక్తం చేస్తే (22) ఆకృతిచ్ఛందంయేర్పడుతుంది.

13. అతిజగతి - ఉక్త, జగతులు (1 + 12) మేళనం చెందడంవల్ల యేర్పడిందిది. దీనిమీద చిట్టచివరి ఛందమైన 26 ఉత్కృతి రూపొందుతుంది.

15. అతిశక్వరి - ఉక్త, శక్వరులు (1 + 14) కలవడంవల్ల రూపొందింది.

17. అత్యష్టి - ఉక్త, అష్టులు (1 + 16) కలిస్తే యేర్పడింది.

19. అతిధృతి - ఉక్త, ధృతుల మేళనంవల్ల (1 + 18) తయారైందిది.

21. ప్రకృతి - ఉక్త, కృతులు కలవడంతో (1 + 20) రూపొందింది.

23. వికృతి - ఉక్త, ఆకృతులు సమ్మేళనం కావడంతో (1 + 22) అవతరించిందిది.
25. అభికృతి - ఉక్త, సంకృతులు (1 + 24) మేళనం చెందగా ఆకృతి గొన్నది.

15 వ (అతిశక్వరి) ఛందస్సు మొదలు 25 వ (అభికృతి) ఛందస్సువరకూ ఉన్న ఛందాలను రెట్టింపు చేస్తే వచ్చేసంఖ్య ఛందస్సంఖ్యా పరిమితిని - అంటే - 26 సంఖ్యను మించుతుంది కాబట్టి రెట్టింపు చేయరాదు. 26 వ. ఉత్కృతి చ్ఛందస్సును రెట్టింపు చేయవలసిన అవసరంలేదు. చేస్తేవచ్చే ప్రయోజనమూ లేదుగదా ! - 26 అక్షరాలను మించి వుండే ఉద్ధురమాలావృత్తాదులను కావాలనుకుంటే యీ ఉక్తాదుల రెట్టింపు సంఖ్యల్లో చేర్చుకొనవచ్చును. ఆ విధంగా చేర్చుకొనడంవల్ల వచ్చే నష్టమేమీ వుండదు. ఇక యిప్పుడసలు విషయంలోకి వద్దాము.

"తోటక" వృత్తం 12వ ఛందమైన జగతీచ్ఛందంలోనిది.తోటకాన్ని పునరుక్తం చేస్తే 24 వ. ఛందమైన "సంకృతి" చ్ఛందంలోని మరొకవృత్తంగా వెలుగొందుతుంది. కాగా "తోటకం వృత్తాఖ్య వృత్తం కాద" న్న వారి సిద్ధాంతం వాస్తవ సిద్ధాంతమూ కాదు, ఛందశ్శాస్త్రసమ్మతమూ కానేరదు - ఈ ఆంతర్యాన్ని శార్‌ఙ్గదేవుడు గుర్తించకపోవడం అట్లావుండగా - శాస్త్ర విషయ సమన్వయ దృక్పథరాహిత్యంవల్ల అసలు ప్రబంధాధ్యాయ నిర్మాణమే నవ్యంగా చెయ్యలేదు. శార్‌ఙ్గదేవుడు దేశీయ ప్రబంధాలనుకుని చెప్పిన వాటివిషయం అలావుంచుదాము. "తోటకం" అన్నది 12 వ ఛందంలో సంజనితమైన ఒకానొక వృత్తం కదా ! దీన్ని ఒక ప్రబంధంగా గ్రహించి "తోటక ప్రబంధం" అని పేరుపెట్టి - (యీ విధంగానే కంద ప్రబంధాదులు -) లక్షణం చెప్తే వచ్చే ప్రయోజనం యేమిటి ? తాల సహిత - తాలరహితత్వాలతో ప్రతివృత్తమూ - ప్రతిపద్యమూ ఒక ప్రత్యేక ప్రబంధమే ననుకున్నప్పుడు ఛందోవృత్త సంఖ్యను స్వీకరించి సూత్ర పద్ధతిలో ఛందః క్రమంలో సమస్తవృత్తాలను స్వీకరించో - అది సాధ్యంకాంక పోతే - వాటిలో కొన్నింటిని మాత్రమే స్వీకరించో వివిధ ప్రబంధాలుగా-సతాల-వితాలాలుగా లక్షణాలు చెప్పవచ్చు గదా ! - ఈ దృష్ట్యా 26 ఛందస్సుల్లోనూ పుట్టిన 13,42,17,726 వృత్తాలనూ తత్సంఖ్యాకాలైన ప్రబంధాలుగా పేర్కొనవచ్చునుగదా ! - యీ పద్ధతిలోనే అర్ధసమ - విషమ - వృత్తాలను కూడా కలిపి మొత్తం - 13510827398,92,72,314 సంఖ్యాత్మకాలుగా ప్రబంధాల విరాట్స్వరూపాన్నే ప్రదర్శించవచ్చునుగదా ! ఇంతేకాదు. 26 అక్షరాలను మించివున్న అక్షర పాదాత్మకాలైన ఉద్ధురమాలా వృత్తాదుల్ని కూడా పరిగణిస్తే వచ్చే నష్టంకూడా యేమీ లేదుగదా ! - ఇంతటి సంగ్రహసూత్రాత్మకమైన-అతివిశాలమైన - గుహ్యోద్గుహ్యతరమైన పద్ధతిలో సంగీతరత్నాకర ప్రబంధాధ్యాయం వినిర్మితమై వుంటే దేశీయ మనబడే పద ప్రపంచమంతా యిందులో అతిసులభంగా అంతర్లీనమై పోయివుండేది. ప్రబంధాధ్యాయానికి అటు ఛందశ్శాస్త్ర పరంగానూ యిటు సంగీత శాస్త్ర పరంగానూ బ్రహ్మాండమైన సమగ్రమైన సువిశాలమైన రాజమార్గం యేర్పడివుండేది. సంగీతరత్నాకరం నిజంగా సంగీతరత్నాకరంగా శాశ్వతంగా ఉప్పొంగివుండేది.

ఏమయితేనేమి ? శార్ జ్గదేవునికి సమగ్రమైన సదవగాహన ఛందస్సంగీత శాస్త్రాలలో లేకపోయినా "పద" శబ్దం కేవల గేయపరమైనదేననిగాని "పద" మంటే కేవలం గేయమనే అర్థం చెప్పాలనిగాని అతడెక్కడా పేర్కొనలేదు. "పద" శబ్దంచేత పాట - పద్యం రెండూ వ్యవహృతాలు - పరిగృహీతాలు- కావచ్చునన్నదే సంగీత రత్నాకర కర్త భావం.

సంగీత చూడామణికర్త తన గ్రంథ ప్రారంభంలోనే

ప్రథమ (మో) మాతృకాఖ్యాస్యాత్
పంచతాలే స్వ (శ్వ) రా (ర) స్తతః ।
గద్యం వృత్తం దండకస్యా
దార్యా కందస్తతః పరమ్ ॥

అంటూ అన్నింటినీ నిర్విపక్షగానే పేర్కొన్నాడు. ఈ చూడామణి కర్త కూడా "పద" మంటే కేవలం పాట మాత్రమేనని యెక్కడా చెప్పలేదు. వృత్తాలను యితర పద్యాలను పదాలు కావని యెక్కడా పేర్కొనలేదు - శార్ జ్గదేవుని మార్గంలో "ద్విపథి - ద్విపది" రెండింటినీ యితడు కూడా పేర్కొన్నాడు.

తెలుగులో సంకీర్తనాచార్యుడుగా గేయకవితా రచనకు - మార్గదర్శిగా - ఆరాధించబడుతున్న శ్రీఅన్నమాచార్యులు "సంకీర్తనలక్షణ" మన్న లక్షణ గ్రంథాన్ని లక్ష్యసహితంగా రచియించాడు. ఈయన క్రీ. శ. 1410 - 1500 మధ్య కాలంలో వున్నవాడు. పదం - అంటే సంకీర్తన, అని ఆధునికులనేకమంది భావించడంతోపాటు యీ భావం ప్రాచీన లాక్షణికులకు కూడా వున్నదని భావించారు. అందువల్ల లాక్షణికుడైన అన్నమాచార్యులైనా యేం చెప్పారో పరిశీలించుదాము.

ఘనత మీరంగ జయదేవ కవివరేణ్యు (
డంద మైనట్టి గీతగోవింద మందు
అంచితాష్టపదులు పల్కె, నట్లపదము
పరగు నెనిమిది పదములు పల్లవియును.

ఇందులో అన్నమయ్య జయదేవుని అష్టపదుల విషయం చెప్పి ఆ అష్టపదులవలెనే పదంకూడా పల్లవితోపాటు యెనిమిది పదాలు కలిగి ఉంటుందన్నాడు. "అట్లపదము" అన్నప్పుడు "పద" శబ్దం కీర్తన - పాట - గేయం అన్న అర్థాలలోను "ఎనిమిది పదములు" అన్నప్పుడు "పద" శబ్దం "చరణములు" అన్న అర్థంలోనూ యీ సందర్భంలో ప్రయోగింపబడింది. ఇంతేగాని "పద" మంటే కేవలం "సంకీర్తన" మాత్రమే "పాట" మాత్రమే అన్నభావాన్ని అన్నమాచార్యులు వెల్లడించలేదు. అష్టపదులు అన్నదానిలో "పది" శబ్దం వున్నది. పదాలు కలది పది. యీ సందర్భంలో "పదం" అంటే చరణం అనే అందరూ అనుకొనే అర్థం.

పాటలపరంగా పదశబ్దాన్ని ప్రయోగించినవారు అనేకమంది వున్నారు. పాల్కురికి సోమనాథాదులు వివిధ పదాలను పేర్కొన్నారు. అయితే అన్నమాచార్యులు స్పష్టంగా సంకీర్తన లక్షణంలో "మహనీయంబగు సంకీర్తన నామకపద సంప్రదాయం పెట్టిదనిన" అని పదాన్ని సంకీర్తన నామకంగా పేర్కొన్నాడు. అన్నమయ్య పేర్కొన్న పద్ధతిని బట్టిచూచినా "పదా" లు అనేక రకాలున్నాయనీ వాటిలో "సంకీర్తననామకం"గా పేర్కొనదగిన "పద" సంప్రదాయం గురించి తాను చెప్తున్నట్లు ఆయన భావంగా మనకు అవగాహన కాగలదు.

రమణీయ సంగీత రత్నాకర ప్రబం
ధాధ్యాయమున నుక్తమయ్యె పదము
సముచిత సంగీత చంద్రికాదేశై శ
యందు మిక్కిలి తేటమయ్యె పదము
అతుల తత్సంవాదమైనట్టి సంగీత
చూడామణికి పల్కుచోటు పదము
ధన్యసంగీత సుధాకర గ్రంథంబు
నందు మిక్కిలి చెలువొందు పదము
తానె యిన్నింటికిని మూలమైన భరత
మందు పంచదశాధ్యాయమందు విమల
వృత్త చూర్ణ నిబంధ కవి విధనామ
భవ్యలక్షణములకు నాస్పదము పదము ॥

అని పద ప్రాచీనత గురించి అన్నమయ్య వ్రాశాడు. గేయంగా లేదా "సంకీర్తన" గా "పదం" ప్రాచీన గ్రంథాలలో యెక్కడెక్కడ చెప్పబడివున్నదో యీ పద్యంలో పేర్కొన్నాడు. అంతే కాని "పదం" అంటే పాట మాత్రమే- "సంకీర్తన" మాత్రమే అని అర్థంవచ్చేట్లు అన్నమాచార్యులు యెక్కడా పేర్కొన లేదు.

భరతముని పదలక్షణం చెప్పాడు కాబట్టి క్రీ॥ పూర్వం 4 వ శతాబ్దం నాటి నుంచే "పద" శబ్దం సంకీర్తనానామకంగా ఉన్నదని చాలా మంది విమర్శకులు భావించారు. యిక్కడ మనం గుర్తించవలసిన అత్యంత సున్నితమైన విషయం ఒకటున్నది. "పద" మంటే కీర్తన-గేయం-అని అర్థం లేదని అనడానికి వీలులేదు. అయితే ఆ ఒక్క అర్థంమాత్రమే ఉన్నదనుకోరాదు. ఛందశ్శాస్త్రానికి సంబంధించినంత వరకూ శార్దూలాది సంస్కృత వృత్తాలు-అర్ధసమ విషమాదివృత్తాలు-దేశిచ్ఛందస్సు లనుకొనబడే సీస ద్విపదాదులూ గ్రాహ్యాలవుతాయి. అంటే పద శబ్దాన్ని సంకీర్తనం - గేయం అన్న అర్థంలోనూ వాడవచ్చు - వృత్తం - పద్యం అన్న

అర్థంలోనూ వాడవచ్చు నని తాత్పర్యం - కాగా "పద" శబ్దాన్ని యెవరైనా సంకీర్తనార్థంలో వాడితే సందర్భాన్నిబట్టి ఆ అర్థం చెప్పుకోవాలే తప్ప దాన్ని పురస్కరించుకొని వృత్తం-పద్యం అన్న అర్థంలేదనీ సంకీర్తనార్థం మాత్రమే వున్నదనీ మనం అనుకోరాదు-ఈ రహస్యాన్ని గుర్తించనందువల్లనే పెక్కు మంది సంగీత-సాహిత్యవేత్తలైన విమర్శకులు "పద" మంటే కేవలం "సంకీర్తన" అన్న అయదార్థాభిప్రాయానికి లోనైపోయారు. "పద మంటే కేవలం సంకీర్తనా నామకం" అని అన్నమాచార్యులెక్కడా పేర్కొన లేదు. "పద" శబ్దం సంకీర్తనా నామకంగా వ్యవహృతం కావడం సంప్రదాయ సిద్ధమేనన్నాడు. తన్నిరూపణం చేశాడు. అంత మాత్రంచేత "పదమంటే పద్యాలే కావునాయనా కీర్తన-గేయాలు కూడా గ్రాహ్యాలే అవుతాయి"అని అన్నమయ్య చెప్పినట్లు అవుతుందిగాని తద్భిన్నంకాదు. అన్నమాచార్యుల దృష్టిలో "పద" శబ్దంచేత సంకీర్తనలే పరిగ్రాహ్యాలై శార్దులాది వృత్తాలు అపరిగ్రాహ్యాలైతే భరతముని నాట్యశాస్త్రాన్ని సవ్యంగా అవగాహన చేసుకుని ఆ మహర్షి అడుగు జాడలలోనే నడచి యీ క్రింది పద్యాలెందుకు రచియిస్తాడు ?

పదము సంస్కృతమున ప్రాకృతమున దేశ
భాషనైన పొసంగ పలుకవలయు
ప్రాసములును యతులు పద్యభంగినెచెల్లు
ననిరి భరత దత్తిలాదిమునులు ॥

బంధుర వృత్తపదంబు ని
బంధపదము చూర్ణపదము భరతాగమ సం
బంధంబున పదవిజ్ఞా
నాంధులకును తాళ్లపాక అన్నయ తెలిపెన్ ॥

అందములై షడ్వింశ
చ్ఛందోగణయుక్తవృత్తజాతుల పదముల్
కుందనమునకుంబరిమళ
మందిన క్రియవృత్త పదము లమరుచునుండున్ ॥

పదం సంస్కృత ప్రాకృతాలలోనేకాదు దేశభాషల్లోనైనా వ్రాయవచ్చు-పద్యాల్లో ఉన్నట్లే పదాల్లోకూడా యతులు ప్రాసలు చెల్లుతాయని భరతాదులు పేర్కొన్నట్లు తొలిపద్యంలో చెప్పాడు. పదవిజ్ఞానం లేని అంధులకు భరతాగమ సంబంధంతో వృత్తపద-నిబంధపద-చూర్ణపదాల గురించి తెలియజెప్పినట్లు స్పష్టంగా పేర్కొన్నాడు. రెండవ పద్యంలో-పదాలంటే-అన్నీ పదాలే పొమ్మన్నాడు. వృత్త పదాలంటే యేమిటని సందేహిస్తారేమోనని 26 ఛందస్సు (ఉక్తాది)ల్లోనూ పుట్టిగణ యుక్తాలైన వృత్తాలు ఇతర జాతుల పద్యాలూ అన్నీ వృత్తాలుగా-వృత్తపదాలుగా-

బంగారానికి పరిమళం అబ్బినట్లు అమరుతాయి అని మూడవ పద్యంలో వివరించి నిజంగానే పదవిజ్ఞానాంధులైన వారు కళ్లు తెరిచేట్లుచేసి వెలుగుబాటలు చూపించాడు.

## పదవిజ్ఞానాంధులు

పాల్కురికి సోమనాధునికి పూర్వంనుంచీకూడా కేవలసంస్కృతాభిమానులైన వారు సమాగ్రమైనదూరదృష్టి-సమాలోకనాదృష్టిలేక దేశీయాలైనవివిధపదాలను-పద్యాలుగా-చెలామణి కాగల ద్విపదలతో సహా అన్నింటినీ తిరస్కారభావంతో చూచేవారు. సంస్కృతమే భాష-మార్గచ్ఛందమే ఛందము అన్నంత తీవ్రభావాలు కలిగి వుండేవారు. ఈ నిరసన భావం కేవలం యేదో అజ్ఞాన భావంతో యేర్పడిందే తప్ప పరిశోధనా దృక్పథంతోనూ సత్యాన్వేషణా దృష్టితోనూ యేర్పడింది కాదు.

కూర్చెద ద్విపదలు కోర్కెదైవార
తెలుగు మాటలనంగ వలదు వేదముల
కొలదియ కాఁజూడుఁడిల నెట్టులనిన
.... .... .... .... .... .... .... .... ....
తప్పకుండగ ద్విపదలు రచింతు
నొప్పదు ద్విపదకావ్యోక్తి నావలవ
దారూఢ గద్యపద్యాదిప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబుగామి
జాను తెనుంగు విశేషము ప్రసన్నతకు
నెట్టన రచియింపనేర్చినజాలు
నుపమింప గద్య పద్యోదాత్త కృతులు
ద్విపదయు సమము భావింప నెట్లనిన
సరళత సరణి ప్రసన్నత నెన్న
పరిణతి గణపద పద్ధతి శబ్ద
.... .... .... .... .... .... .... ....

అంటూ ద్విపదను నిరసించే వారి భావాలను త్రోసిపుచ్చుతూ ద్విపదను సమర్థించుకున్నాడు సోమన-శైవమత ప్రచారంలో దేశిచ్ఛందోరీతులనబడినవన్నీ ప్రముఖపాత్ర వహించాయి. యెన్నెన్నో విధాలైన గేయాలు (పదాలు) శివ భక్తులు శివరాత్ర్యుత్సవాదుల్లో పాడేవారని సోమన తెలియజేసేవాడు. దేశి ఛందస్సుకు జానపదత్వం వుంటుందన్న కారణంగాను శైవమతద్వేష కారణంగాను

నాటి పండితకవులు శిష్టులు దేశీయాలనబడిన ఛందస్సులను-చాలా చులకనగా హేళనా పాత్రాలుగా తిరస్కారభావంతో చూచేవారు. అదేమంటే అవైదికం-అప్రామాణికం అనేవారు-అయితే దేశిచ్ఛందస్సులన్నీ అనంతకోటి సంస్కృతచ్ఛందో రీతుల్లో అంతర్లీనమవుతాయనిగాని ద్విపదాదులకు వేదాలలోనే స్థానం ఉన్నదని గాని వీరికి తెలియదు. అందువల్లనే దేశిచ్ఛందస్సులనబడిన వాటిని తిరస్కరించారు.

"పాలకురికి సోమపతితుఁడీ నడుమను
బెనిచెఁ బ్రాసవళ్లు పెట్టి ద్విపద
యప్రమాణమిది యనాద్యంబు పదము"

అని పిడుపర్తి సోమన తన బసవ పురాణంలో-"ఓరుగంటిలో బసవ పురాణాన్ని కొందరు చదువుతుంటే ప్రతాపరుద్రుడాదారివెంటవెళ్తూ 'వారు చదివేదేమిటి ?' అని ప్రశ్నిస్తే ఒకదూర్తబ్రాహ్మణుడన్నమాటగా" పై మాటలు రచించాడు. ద్విపద వేదబద్ధమైన ఛందమేనన్న విషయం తెలిస్తే ఆధూర్తుని బుద్ధిలో ఇటువంటి భావానికి తావుండేది కాదుగదా.

ఏమైనా పాల్కురికి సోమనకు పూర్వకాలంలోనే బైలుదేరిన మాత్రా చ్ఛందస్సుల నిరసనభావం వివిధ గేయాలన్నిటిపట్లా – చివరికి అవి యేమతభక్తి ప్రబోధకాలు అయినాసరే-వ్యాపించిందని అన్నమాచార్యులు "పద" ప్రమాణికతా నిరూపణకోసం అంత ప్రయత్నం చెయ్యడం చెప్పకుండానే చెపుతున్నది. ఎంతో భక్తుడు-ఎంతో సౌజన్యమూర్తి అయిన అన్నమాచార్యులు "పదవిజ్ఞానాంధులకు" భరతాగమ సంబంధంగా తెలిపినట్లు పేర్కొన్నాడంటే యీ 'పద' నిరసనా పూర్వకమైన అజ్ఞానం మూర్ఖత్వం నాడు దేశంలో యెంత స్థాయిలో వున్నదో మనం వూహించవచ్చు. ఈ అజ్ఞానాన్ని పారద్రోలి విజ్ఞానజ్యోతిని చూపించడానికే "పద" మంటే యేమిటో భరతముని చెప్పిన పరమ ప్రామాణికలక్షణ స్వరూపం యేమిటో అన్నమాచార్యులు "సంకీర్తన లక్షణం" లో విస్పష్టంగా విరచించాడు. భరతాదుల దృష్టిలోను-చివరికి అన్నమయ్య దృష్టిలోనూ "పద" మంటే కేవలం గేయం మాత్రమే కాదనీ వృత్తాదులన్నీ పరిగ్రాహ్యాలేననీ మనం విస్పష్టంగా గ్రహించాం-యింక యిప్పుడు గేయార్థకంగా పదమంటే యేమిటో తెల్సుకుందాము.

## పదమంటే శృంగారపదం మాత్రమేనా ?

పదమంటే కేవలం పాట మాత్రమేనని కొందరభిప్రాయపడగా ఆ శబ్దంచేత యేపాటైనా గ్రాహ్యమవుతుంది అని తెలిసిన పెద్దలుకూడా యేకారణం వల్లనో "పదమంటే కేవలం శృంగారపదమేనన్న భావం" వెల్లడించారు. ఈ భావాన్ని తమవరకే పరిమితంగా ఉంచుకున్నా సమంజసంగా ఉండేది. కాని ఇది ప్రాచీనులైన పదకర్తలలో కూడావున్నట్లు అభిప్రాయపడి యీ క్రిందివిధంగా పేర్కొన్నారు.

"కాని యీవల శృంగార"రసమయమై రాగతాళ నిబద్ధమైన రచనకు"పదము అను సంకేతనామము వాడుటసంగీతరసికుల సంప్రదాయమైనది. క్షేత్రయ్యకాలమునకే యీ వాడుక వచ్చినట్లున్నది. ఒకనాయిక మువ్వగోపాలుని "పదము పాడగా

వినేవో చదరంగమే చూసేవో" అని ప్రలోభనము చేసినది. ("ఏమనే వాన తీరా"-అను పదము.) శృంగారమయమైన రచన కాకపోయినచో మువ్వగోపాలుడు మొగమిచ్చి వినువాడేనా ? కాని నేనిక్కడ పాట అను సామాన్యార్థమునందే పదము అను మాటను వాడుచున్నాను." *

పదమంటే పాట మాత్రమేకాదు అని గతంలో గుర్తించాము. క్షేత్రయ్య దృష్టిలో కూడా "పద" మంటే కేవలం శృంగారపదం మాత్రమేనన్న భావం లేదు. "గోపాలుడు గానలోలుడు." కాబట్టి పదాలకై ప్రలోభపడవచ్చు. ఆ ప్రలోభత్వం గానపరమైనదికాని నవరసాల్లో ఒకేఒక శృంగార రసపరమైనది మాత్రమేకాదు. ఏ రసమయమైన పదానికైనా గోపాలుడు ప్రలోభుడవుతాడు. నవరసపదాలలో శృంగారేతర పదాలకంటే శృంగారపదాలకు యెవరైనా మరింతగా ప్రలోభులవుతారంటే అది వేరుమాట. ఒకవేళ క్షేత్రయ్య "ఏమనే వాన తీరా"అన్న పదంలో "పదము పాడగా వినేవో" అనడంలో కేవలశృంగారపదాన్ని ఉద్దేశించి "పద" శబ్దమే (శృంగార పదాన్నైనా పదమనవచ్చును కాబట్టి) వాడినా అప్పుడది విశేష నిర్దిష్టమై శృంగారపదాన్ని దృష్టిలో పెట్టుకుని ప్రయోగితమైనదే అవుతుందిగాని "పద" మంటే కేవల "శృంగారపదమే"నన్న భావానికి తావీయదు. శృంగారపదాన్ని పదమని పేర్కొనడం వేరు- శృంగారపదం మాత్రమే "పద" మనడం వేరుగదా !

పాటల పరంగా "పద" శబ్దంచేత అనేక విధాలైన పాటలు-ఛందోపరంగా రసాలపరంగా-భావాలపరంగా — రాగతాళాలపరంగా యెన్నివిధాలైనపాట లున్నాయో అన్నీ గ్రాహ్యాలే అవుతాయి. ఈ రకరకాల పదాలలో సంసారపదాలు -మాయాపదాలు-స్తవపదాలు-తుమ్మెదపదాలు - ప్రకృతిపదాలు - పర్వగపదాలు - అనంతపదాలు - శంకరపదాలు - నారాయణపదాలు - బ్రహ్మపదాలు - శూన్యపదాలు-తత్వపదాలు-కస్తూరిరంగపాటలు-నివాళిపదాలు - వాలేసుపదాలు - గొబ్బిపదాలు - వెన్నెలపదాలు - సంజవర్ణనపదాలు - గణవర్ణనపదాలు - శృంగారపదాలు - వీరపదాలు - కరుణపదాలు - అద్భుతపదాలు - హాస్యపదాలు - భీభత్సపదాలు - భయానకపదాలు - రౌద్రపదాలు - శాంతపదాలు-నామపదాలు - (క్షేత్రయ్యపదాలు - విజయరాఘవ పదాలువంటివి) కథాపదాలు-సమపదాలు - జాళ పదాలు - సారంగపదాలు - పాళిపదాలు - గొల్లపదాలు - చెంచుపదాలు - మొక్కుబడి పదాలు - పోలేరమ్మపదాలు - కూనలమ్మపదాలు - సాంగత్యపదాలు - చానపదాలు - అనువుపదాలు - అలుకపాటలు - అప్పగింతపాటలు - చెండ్లాటపాటలు - అల్లోనేరేళ్లపదాలు - కోతిఆటపదం - తలంటుపాట - తిల్లానపాట - గొండె ఆడింపుపాట - నలుగుపాట - బంతులాట పాట - చెండులాటపదాలు - సంవాదపదాలు - కదురుపదాలు - దూదేకుపదాలు - ఊయెల పాటలు

---

* సాహిత్యోపన్యాసములు - (3) క్షేత్రయ్య పదకవిత్వము (12 వ పుట.) శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి రచన. ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ ప్రచురణ.

- జోలపాటలు - లాలిపాటలు - మేలుకొలుపులు - మంగళహారతులు - పెళ్లిపాటలు - తలుపుదగ్గరపాటలు - గర్భాదానపుపాటలు - వివిధ క్రీడాపదాలు - రోకటిపాటలు-ఊడుపుపాటలు-కోలాటపుపాటలు - భజనపదాలు - గౌడుగీతాలు- - జాజరపాటలు - బండిపాటలు - ఊతపదాలు (కష్టమైన పనులు చేసేటప్పుడు పాడేపాటలు.) ఏలపదాలు - ఊలపాటలు - చిలుకపదాలు - గోరువంకపదాలు - సువ్వి(సువ్వాల)పాటలు-ధవళాలు-పరువులు-బ్రతుకమ్మపాటలు-చందమామపాటలు - లేలేపాటలు - నీతిపదాలు - బూతుపదాలు - వేదాంతపదాలు - మొదలైన పదాలు రకరకాలు గ్రాహ్యాలవుతాయి - కోట్లాదిదేవతలున్నారు. ఆయా దేవత లందరిపైనా విడివిడిగా పాడబడేపాటలు - శంకరపదాలు - నారాయణపదాలవలె వేరువేరుగా ఆయాదేవనామాలతోటి పదాలుగా వ్యవహృతాలవుతాయి - ఇంద్ర పదాలు - కుమారపదాలు-వీరభద్రపదాలు ఇత్యాదిగా పదాలపేర్లురూపొందుతాయి. యీ విధంగానే వివిధ వర్ణనలకు సంబంధించిన పదాలు ఆయావర్ణన నామక పదాలుగా పేర్కొనబడతాయి. ఎన్నెన్నో విధాలుగా ఉన్న యీ పదాలలో కొన్నిటిని పాలుకురికి సోమనాథుడే పండితారాధ్యచరిత్రలో పేర్కొన్నాడు. ప్రజల్లో ప్రత్యేకించి - పాటకజనుల్లోనూ - కష్టజీవుల్లోనూ - వివిధ ప్రాంతాల్లో యేంపాటలో చెప్పలేని-పేర్లు తెలియనిపాటలు యింకా అనేకం వున్నాయి - అయితే యెన్నెన్ని పాటలు వున్నాయో అన్నింటికీ మాత్రాచ్ఛందస్సులేవున్నా అన్నీ ఏకైక చ్ఛందోబద్ధాలుకావు. వీటిని ఛందఃపరంగా వివిధ వర్గాలుగా విభజించడానికి వీలున్నా పాడేవరుసల్లో - తాళపద్ధతుల్లో భిన్నభిన్నాలుగా వుంటాయి. మరీ విచిత్రమేమంటే మాత్రలు సమానంగా వున్న పాటలుకూడా పదబంధాలకూర్పుతో - విరుపులతో - రాగతాళాలలో మార్పుచెందుతాయి. మాత్రాచ్ఛందాలలోవున్న ప్రత్యేకతే యిది. చివరికి ప్రథమాక్షరం దీర్ఘమై సాగే పాటకు - ద్వితీయాక్షరం దీర్ఘమై సాగే పాటకు - మాత్రాసమకత్వం వున్నా రాగ తాళలయల్లో భిన్నత్వం వుంటుంది. అనంతమైన భేదనాదాలతో విలసిల్లే యీ పదాలన్నీ "పద" శబ్దవాచ్యాలే - కాగా "పద"మంటే కేవలం శృంగార పదం మాత్రమేనన్న భావం పరివ్యాప్తిచెందడం విస్తృతార్థంకల పదశబ్దానికి అవ్యాప్తిత్వా ర్థాన్ని రూపొందించడమే కాగలదు. ఒక్క క్షేత్రయ్య కాలంలోనేకాదు - ఆ తరువాతి తంజావూరు రాజుల కాలంలో అవతరించిన పదసాహిత్యంకూడా కేవల శృంగారపరమై మాత్రమేలేదు. త్యాగేశపదాలు - వెంకటేశపదాలు - నానావిధపదాలు - నీతిపదాలు - హాస్యపదాలు - మొదలైన భేదాలతోనే అవతరించింది. కాగా తంజావూరునేలిన మహారాష్ట్ర రాజుల కాలంలోకూడా "పద" మంటే కేవలం శృంగారపదం మాత్రమేనన్నభావం యేర్పడివున్నట్లు కనబడదు.

అయితే "పద" మంటే "శృంగారపదమే" నన్నభావం సంఘంలో ఒక విధంగా కొంతకు కొంతైనా కలిగినమాటకాదనలేము. యీ భావోత్పత్తి అకారణంగా జరిగిందికాదు. యేదో ఒక విశిష్టకారణం లేకుండా యే భావమూ ఉత్పన్నంకాదు. ఏదైనా పొరపాటు జరిగితే అది జరగడం అకారణంగా యెప్పుడూ జరుగదు - భ్రమో - ప్రమాదమో - అలసత్వమో - అభిమాన - నిరభిమానాలో ఇత్యాదిగా యేదో ఒకటి కారణం మూలమై జరుగుతుంది.

లోకంలో అందరూ మనుషులుగానే పరిగణన - అందరూ మనుషులే అయినా "అసలైన మనిషిగా - సరైన మనిషిగా" ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కరిని పరిగణించడమో-కనీసం కొన్ని సంఘటనలను పురస్కరించుకుని ఆవిధంగా ప్రశంసించడమో జరుగుతుంది. ఎవరైనా ఒకవ్యక్తి-పట్టుదలగాకార్యాన్ని నిర్వర్తించినా - సామాన్యంగా యితరులు చెయ్యలేని పనిచేసినా - ఒకమాట అని ఆ మాట నెరవేర్చినా - అటువంటి సందర్భాలను పురస్కరించుకుని "వాడురా మనిషంటే - భలే పనిచేశాడు" "అది అట్లా చెయ్యాలి - వాడు మనిషంటే" అన్న పద్ధతిలో సంఘంలో ప్రశంసించడం జరుగుతుంది. అయితే యిటువంటి ప్రశంసలవల్లఅతని విశిష్టత వ్యక్తమవుతుందిగాని అతడొక్కడే మనిషనీ తక్కినవారు మనుషులు కారనీ అర్థం చెప్పుకుంటామా ?

యిదే పద్ధతిలో "పద" మంటే "శృంగారపద" మన్న అర్థం వచ్చివుంటుంది. రసాలు తొమ్మిది. "శృంగార - వీర - కరుణ - అద్భుత - హాస్య - భీభత్స - భయానక - రౌద్ర - శాంత" రసాలు - ఈ తొమ్మిదీ ఒకదాని కొకటి తీసిపోనివి సమాన ప్రతిపత్తి కలవి కాబట్టే "నవరసా"లుగా పేర్కొనబడ్డాయి. అయినా ప్రాచీన కాలంలోనే ప్రముఖ సాహిత్య శాస్త్రజ్ఞులు "శృంగారంరసరాజం" అన్నారు. వారిమాట అంత తేలిగ్గా త్రోసిరాజనడానికి వీలైంది కాదు. రసాలన్నీ ఒక్కటే నన్నప్పుడు రసరాజంగా ఒక రసానికి విశిష్టస్థానం యే విధంగా యిస్తాము ? అయితే అటువంటి స్థానం శృంగార రసానికి యివ్వడానికి కారణం లేకపోలేదు.

రసాలన్నింటికీ మానవుని జీవితంతో సంబంధం వున్నది. శృంగారేతర రసాలకంటే శృంగారరసానికి ఒక్క మానవ జీవితాలలోనే కాదు ప్రాణికోటి మొత్తం బ్రతుకులలోనే - అసలు సృష్టిలోనే ప్రత్యేకమైన-అసాధారణమైన అఖండమైన స్థానం వున్నది. "వీర - కరుణ - అద్భుత - హాస్య - భీభత్స - భయానక - రౌద్ర - శాంత" రసాలలో యేరసం లేకపోయినా యీ అష్టరసాలూ లేకపోయినా సృష్టిలోవచ్చే వైపరీత్యం యేమీ ఉండదు. అయితే శృంగారమే లేకపోతే సామాన్యంగా మానవుని బ్రతుకుకే కాదు అసలు సృష్టికే-ప్రత్యేకించి ప్రాణికోటి సృష్టికే వైపరీత్యం యేర్పడుతుంది. శృంగారపరమైన భావంమీద తద్రసోత్పత్తిమీద ఆధారపడేకదామిధునకార్యం-సృష్టికార్యంఅంతాజరుగుతున్నది. ఇది కొరవడినప్పుడు ప్రాణి సృష్టికే స్తంభన యేర్పడుతుంది. శృంగారం ప్రాణి సృష్టిస్వభావానికి ప్రతిబింబం. అదికేవల ప్రకృతి స్వభావం - అటువంటిదాన్ని మనం ఆపాలని ప్రయత్నిస్తే మనమే ఓటమి నంగీకరించక తప్పదు. ప్రకృతి సిద్ధమైన దాంపత్య జీవితాలకు బౌద్ధం స్వస్తి చెప్పినందువల్లనే క్రమంగా - అసలు బౌద్ధారామాల్లోనే పతనస్థితికి స్థానం యేర్పడి - చివరికి బౌద్ధమే దెబ్బతిన్నది. ఎక్కడో యెవరో "తురీయాశ్రమ స్వీకరణ"తో - యే ఒకరో యిద్దరో పదుగురో సృష్టికార్యాన్ని దీటుగా ఆకట్టినంత మాత్రంచేత వచ్చేనష్టం వుండదు. కాని అదే ఒక ఉద్యమ రూపందాల్చి కనపడిన ప్రతివ్యక్తికీ - సన్యాసాశ్రమం ప్రసాదించే పరిస్థితి వస్తే సంఘం - ప్రకృతి సిద్ధమైన - స్వభావ బద్ధమైన - శృంగారానికి లోబడకా

తప్పదు – సన్యాసం కళంకాంకితంకాకా తప్పదు. కాగా ప్రకృతిసిద్ధమైన శృంగార పరమైన శక్తిని ఆపడం సృష్టికే విరుద్ధం – సృష్టిస్వభావానికే విరుద్ధం – అది పూర్ణంగా ఆగిననాడు సృష్టికే స్థంభనం యేర్పడుతుంది. సృష్టివ్యవస్థతోనే శృంగారానికి అవినాభావ సంబంధం – అఖండమైన సంబంధం వున్నది. అందువల్లనే మన పూర్వులు "శృంగారం రసరాజం" అన్నారు. వాస్తవానికి అది రసరాజం మాత్రమే కాదు – రసనైజం – నైజరసం – శృంగారరసానికున్న యీ వైశిష్ట్యాన్ని దృష్టిలో పెట్టుకునే శృంగారేతరరసాలు చిప్పిలేపదాలు యెన్నెన్నివున్నా "శృంగారపదాల" కున్న ప్రత్యేకత ఇతరపదాల కుండదు కాబట్టి "శృంగార పదమే పదం" అన్నభావం తలయెత్తి వుంటుంది. తత్ఫలితంగానే "పద" మంటే శృంగారం చటుక్కున గుర్తుకు రావడం–క్రమంగా "శృంగారపదమే పదం" అని చెప్పుకోవాలన్న దృష్టి శృంగార ప్రియులకు కలగడం జరిగి వుంటుంది. కాగా "పద"శబ్దానికి "శృంగార పదం మాత్రమే"నన్న అర్థం లోకంలో వ్యాప్తి చెందడం నిష్కారణంగా జరగలేదని గుర్తించక తప్పదు. అయితే "పద" మంటేశృంగారపద మాత్రమేకాదు. ఇతర అనేక పదాలు కూడా శృంగారపదాలతోపాటుపదాలే–

## పాదం—చరణం

పదం అంటే పాదం అడుగు అని అర్థాలున్నాయని గతంలో గుర్తించాము – చరణం అంటే కూడా అడుగు – పాదం అని అర్థాలున్నాయి. చరణం అన్నపదాన్ని పాటల్లో పల్లవికి తరువాతగాని అనుపల్లవివుంటేదానికి తరువాతగాని వుండే పాటభాగాలకు వాడతారు. అయితే పద్యాల్లో వుండే పాదాలనుకూడా చరణాలని కొందరనడం కద్దు – పాదానికి చరణం పర్యాయపదం కాబట్టి పద్య పాదాన్ని చరణంగా – "ఆ పద్యంలో రెండవపాదం చదువు – మూడవపాదం చదువు" అన్నట్లుగానే– "రెండవచరణం చదువు – మూడవచరణం చదువు" అని అనడం కూడా కద్దు – పాదం చరణ పర్యాయపదమే – కాని చరణంలోకూడా పాదాలుంటాయి. ఇది ఒక విశేషం — పద్యానికి సామాన్యంగా నాలుగుపాదాలు ఉంటాయి. అని అన్నట్లే చరణానికికూడా నాలుగు పాదాలుంటాయని చెప్పవచ్చు. రెండుపాదాల పద్యాలు – మూడుపాదాల పద్యాలు – ప్రత్యేక పరిస్థితుల్లో అయిదు–ఆరు–ఏడు పాదాలపద్యాలు వున్నట్లే రెండుపాదాల చరణాలు – మూడు – అయిదు – ఆరు – ఏడు పాదాల చరణాలు కూడా వుండవచ్చు – చరణానికి పద్యానికి వాస్తవంలోపోలిక లేదు. పాదాల విషయంలోనైనా నామ మాత్రసామ్యమేగాని వేరే సామ్యం లేదు. పోల్చాలంటే పాటను పద్యాన్ని పోల్చి చూడాలి. పద్యం పూర్తి స్వరూపం – పాట పూర్తి స్వరూపం. పద్యానికి పాదాలుంటాయి. పాటకు చరణాలుంటాయి. పద్యానికి ఎన్ని పాదాలైనా ఉండవచ్చు– అనేకాలు – అంటే రెండు మూడు మొదలుగా పాదాలుండవచ్చు – ఏకపాద పద్యాలు కూడా ప్రత్యేక వ్యవస్థల్లో వుంటాయి. ఏకైక చరణం కలపాటలున్నా పల్లవిగాని అనుపల్లవితోకూడిన పల్లవిగాని ఉంటాయి. పల్లవిలేని మాత్రాచ్ఛందాలతో కూడిన పాటలుకూడా వుంటాయి. పాటల్లో పల్లవి లేకుండా అనుపల్లవి ఉండ

నేరదు. అయితే పల్లవితోపాటు అనుపల్లవి ఉండాలన్న నియమం సార్వత్రికం కాదు. అనుపల్లవి ఉంటే పల్లవి ఉన్నదన్నమాటే. కొన్ని పాదాలతో పద్యం పూర్తిరూపం దాల్చుతుంది. కొన్ని పాదాలతో పాట పూర్తిరూపం దాల్చుతుందా ? తాల్చితే తాల్చనూవచ్చు తాల్చకపోవనూవచ్చు - పర్యాయంగా యీ వ్యవస్థనిలా పేర్కొనడానికి కారణం పాట స్వరూపం ఏక - ద్వి - త్ర్యాది చరణాలపై ఆధారపడి ఉండడం - ఒక్క చరణం కలపాటయితే పద్యంవలె రెండు - మూడు - నాల్గు-అయిదు ఇత్యాదిగాగల పాదాలతో (చరణానికి ఎన్ని పాదాలైనా ఉండవచ్చు గదా !) పూర్తవుతుంది. ద్వి - త్ర్యాది చరణాలుగల పాటయితే కొన్ని పాదాలతో ఒక చరణం పూర్తవుతుంది కాబట్టి అటువంటి చరణాలు కొన్ని వుంటేనే తప్ప పాట పూర్తి కాదు. అంటే పాట - పద్యం - పూర్ణస్వరూపం దాల్చడంలో ఉన్న పాదాల పాత్ర - పాదశబ్ద నిర్దేశితాలయ్యేవాటిపాత్రపక్షైక స్వరూపం కలదికాదన్నమాట. పద్యంలో "పాద" శబ్దనిర్దేశితాలు తమకైతాము స్వయంగా నేరుగా పద్యభాగాలై అదిరూపు దాల్చడంలో పాత్ర వహించగా - పాటలో పాదశబ్ద నిర్దేశితాలు తమకైతాము స్వయంగా నేరుగా పాటభాగాలై అదిరూపు దాల్చడంలో పాత్ర వహించలేవు. పద్యంలో పాదం భాగం - పాటలో చరణం భాగం - ఆచరణంలో పాదం ఒక భాగం - పాటలో పాదాలవల్ల చరణం రూపొంది చరణంవల్ల-లేదా చరణాలవల్ల పాట రూపొందుతుంది. అంటే పద్యంలో పాదాల స్వభావాలకు పాటలలో పాదాల స్వభావాలకు భిన్నత్వం వున్నదని విస్పష్టమవుతున్నది. విభిన్న స్వరూప స్వభావాలు గల పద్యాల పాటల పాదాలను రెంటినీ "పాద" శబ్దంచేతనే యెలా వ్యవహరించారు ? పాటల చరణంలో భాగాన్ని తెలిపే పాదశబ్దానికి - పద్యంలో భాగాన్ని తెలిపే పాదశబ్దానికి ఒకే అర్థమా ? భిన్నార్థాలున్నాయా ? ఒకటే అర్థమైతే పద్యంలో స్వయంగా నేరుగా భాగమైన పాద నిర్దేశిత్వానికి - పాటలో స్వయంగా నేరుగా భాగం కాకుండా చరణభాగమై దానిద్వారా భాగమైన పాదనిర్దేశిత్వానికి ఏక నామక అర్థసమన్వయత్వాలు ఏ విధంగా సమకూరతాయి? ఒకవేళ భిన్నార్థాలుంటే అవి యేమిటి ? ఏకార్థకాలు కానప్పుడు పద్యం - పాటలలో వుండే పాదాల స్వరూప స్వభావాలు విభిన్నమైనవేనని ఆమోదించక తప్పదు. కాగా పద్యం - పాటల పరంగా "పాద" శబ్దార్థ విచారణ మరికొంత చేయవలసి వుంటుందన్నమాట.

"పద" శబ్దార్థాలేమో పాదమంటే యేమిటో గతంలో కొంతగుర్తించాము అయితే పద్యానికి నాలుగు పాదాలుంటాయని ప్రాచీనలక్షణకారులు పేర్కొన్నారు. నాలుగు పాదాలుంటాయని వారు చెప్పారే తప్ప నాలుగు పాదాలెందు వల్ల వుండాలో అందుకుగల కారణాన్ని యెక్కడా పేర్కొనలేదు. ప్రాచీన లాక్షణికుడైన కవిజనాశ్రయకర్త

నాలుగు పాదంబులతో

నాలుగు ప్రావళ్లు గూడినను పద్యము....

అంటూ చెప్పిన విధంగానే పెక్కురు లాక్షణికులు పేర్కొన్నారు.

ఆధునిక సాహిత్యవేత్తలలో విమర్శక ప్రముఖులలో ఒకరైన శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు

"కాని పదముఅనగా పాదము-కాలు అన్నదే మూలార్థమని చెప్పవచ్చును. తాత్పర్యవృత్తిచేత రెండింటి, లేక నాల్గింటి, ఒక భాగము అనునర్థము రావచ్చును. సంస్కృతభాషయందు పదశబ్దమునకు ఎన్నో అర్థములు ఇట్లు తాత్పర్యసిద్ధములైనవి కలవు. ఈ భాగము అనునర్థము గల పదశబ్దము పద్యము అను పేరిలోనే అంతర్గామిగానున్నది. పద్యం చతుష్పదం అన్నారు లాక్షణికులు. కాని ద్విపదలో రెండవభాగమని షట్పదిలో ఆరవభాగమని అర్థమును ఈ పద శబ్దమిచ్చుచున్నది. కాని ప్రాయికముగా అన్ని భాషలందును పద్యమునకు నాలుగు భాగము లేయుండును. నాలుగుమూలల చౌకమందే-చతురశ్రమందే-మనదృష్టికి అందము సహజముగా స్పష్టముగా అనుభవమునకు వచ్చునుగదా! జయదేవుని గీత గోవిందమునకు "అష్టపది" అను పేరుండుట సుప్రసిద్ధమే-దానిలో ఒక్కొక్క పాటకు ఎనిమిది పదములు, నుడుగులు, కలుగుట అందుకు కారణము. కాని తెలుగునందును కన్నడమునందును భాగము అనునర్థము పోయి "పదము" అనగా నిండుపాట అనియే అర్థము నిలిచినది-. *

అని పేర్కొన్నారు. పదశబ్దానికి ఎన్నో అర్థాలుండవచ్చు. పద్యభాగాన్ని పాదం లేదా పదం అని యెందువల్ల అన్నారు? పద్యానికి నాలుగు పాదాలుంటా యన్న భావం యెందువల్ల వచ్చింది? పద్యపాదసంఖ్యకూ-పాదశబ్దానికి ఉన్న సంబంధం యేమిటి? యీ సంబంధంలో అర్థానికి వున్న పాత్ర లేదా ప్రాధాన్యం యెటువంటిది? అని ఆలోచించి ఒక సమన్వయాన్ని సమకూర్చవలసి వున్నది. "పాద" మనగా "కాలు" అన్న అర్థముతో ప్రారంభమై "భాగము"ను చేపట్టి-నాలుగుమూలలచౌకమును చూచి అష్టపదివరకూ వెళ్లడంలో కాళ్లెన్ని? భాగ విభజనసంఖ్యాపరిమితియెంత? అన్న ప్రశ్నలు దృష్టికి రానందువల్ల ఏకవాక్యతా సమన్వయాలు లోపించడంతోపాటు శాఖాచంక్రమణక్రియ కవకాశం లభించి నట్లయింది. పాదం అంటే కాలు అని అర్థం వున్నది-కాలుకు చరణానికి పర్యాయ పదమైన అడుగు శబ్దాన్ని కూడా "పాదం" అన్న అర్థంలో ప్రాచీన లాక్షణికులు తరచుగా ప్రయోగించారు- "రెండవ అడుగున-మూడవ అడుగున-నాల్గవ అడుగున" ఇత్యాది ప్రయోగాలు ఆయాపద్య పాదాలను నిర్దేశిస్తూ వివిధ సంధర్భా లలో చేశారు. "భాగ" మన్న భావంపద్యపాదాల విషయంలో ప్రాచీనులకున్నట్లే కనబడదు. కాలు అన్న అర్థాన్ని దృష్టిలో పెట్టుకుని పద్యపాదాల సంఖ్య గురించి ఆలోచిస్తే కాళ్లు ఎన్ని అన్న ప్రశ్నను పురస్కరించుకుని మానవ పాదాలను స్వీకరిస్తే రెండే అవుతాయి. డార్విన్ సిద్ధాంతరీత్యా నరుడు తొలుత వానరుడుగా నాలుగు పాదాలు కలవాడు కాబట్టి నాల్గుకాళ్లను గ్రహించుదామా

---

* సాహిత్యోపన్యాసములు (౩) క్షేత్రయ్యపదసాహిత్యము. పుట-11.

అంటే-డార్విన్ సిద్ధాంతం వాస్తవిక సత్య ప్రతిబింబకంగా ఆమోదించడానికి తార్కికంగానూ-సృష్టిస్వరూపస్వభావ వ్యవస్థా పరిణామపరంగానూ - ఖగోళశాస్త్ర పరంగానూ-అవకాశాలు సకృత్తుగానైనా కనిపించడంలేదు. మానవ పశు పక్ష్యాదుల పాదాలను దృష్టిలో పెట్టుకుని పాదసంఖ్య ఏర్పరచారా అని ఆలోచిస్తే-రెండుకాళ్లు గల మానవులు పక్షులు-నాలుగు కాళ్లుగల పశువులు ఇతర జంతువులు దృగ్గోచరమవడం జరుగుతుంది. ఈపద్ధతిలో ద్విపద చతుష్పదల (నాల్గు పాదాలున్నవృత్తాల) వ్యవస్థ రూపొందిందని చెప్పవచ్చు-కాని త్రిపద-షట్పది-సప్తపద అష్టపది-వంటి వాటి పాద వ్యవస్థలకు మూలంగా పేర్కొనడానికి అన్ని పాదాలున్న-(కాళ్లుగల) ప్రాణులున్నాయని భావించగలమా? అసలింతెందుకు? ఒక జాతి ప్రాణి పాదాలను దృష్టిలో పెట్టుకుని కొన్ని పద్య పాదాలు-మరొకజాతి ప్రాణి పాదాలను దృష్టిలో పెట్టుకుని వేరొక కొన్ని పద్య పాదాలు నిర్ణయించి వుంటారనడంలో సామంజస్యంగాని ఔచిత్యంగాని ఉన్నదనుకోగలమా? వేద వాఙ్మయంలోనే చతుష్పదలతోపాటు ద్విపదలకు త్రిపదలకు తదితరాలకు కూడా విస్తృతమైన స్థానం వుండనే వున్నది- కాగా ప్రాణికోటి పాదావయవ సంఖ్యను దృష్టిలో పెట్టుకుని పాదనిర్ణయం చేశారని చెప్పలేము.

చౌకం-చతురశ్రం సౌందర్య ప్రదమనుకుంటే వేదకాలంనుంచీ ప్రయోగితాలై ప్రసిద్ధాలైన ద్విపద త్రిపద-షట్పదాదికాలైన ఛందాలలో సౌందర్యానికి లోపం వున్నదనగలమా? చౌకానికి స్థానం ఉన్నదనగలమా? నాలుగు పాదాలున్న పద్యంలో గణ క్రమ సమత్వమే గాని పైనుంచి క్రిందికి సమత్వం లేదుగదా!-చతురశ్ర దృష్టి పాదసంఖ్యకే కాక నిలువు అడ్డాలలో, అంటే వామం నుంచి దక్షిణగతికి-ఉపరితలం నుంచి అధోగతికి అక్షర సంఖ్యలో కూడా ఉండాలిగదా!-ఈ దృష్ట్యా ఎన్నవ ఛందంలో పద్యం వ్రాస్తే-అంటే పాదానికి యెన్ని అక్షరాలుంచి (పద్యం) వ్రాస్తామో అన్ని పాదాలు ఉండవలసి వస్తుంది. ఉదాహరణకు ఉత్పలమాల తీసుకుందాం-దీనికి పాదానికి యిరవై అక్షరాలుంటాయి. చతురశ్ర దృష్టితో యీ పద్యం పూర్ణంగా ఉండాలంటే యిరవై పదాలు ఖచ్చితంగా ఉండి తీరాలి. అప్పుడు చౌక-చతురశ్ర సౌందర్యం రూపొందుతుంది.

చౌకం దృష్టితో పర్యాలోకనం చేస్తే "ఉక్త" ఛందస్సులో పుట్టే రెండు వృత్తాలకు నాలుగు పాదాలుండడానికే వీలులేదు. ఒకే ఒక పాదం ఉండి తీరాలి. రెండవ ఛందమైన "అత్యుక్త"లో పుట్టిన నాలుగు వృత్తాలకూ నాలుగు పాదాలు వంతున కాకుండా రెండు పాదాల వంతున వుంటేనే చతురశ్రం యేర్పడుతుంది. మూడవ ఛందమైన "మధ్యమ" లో పుట్టిన ఎనిమిది వృత్తాలకు నాలుగు పాదాలు కాకుండా మూడే మూడుపాదాలు మాత్రమే వుండవలసివస్తుంది. కేవలం నాలుగు పాదాలతో చతురశ్రం యేర్పడే వృత్తాలు ప్రతిష్ఠాఛందంలో పుట్టిన పదహారు వృత్తాలు మాత్రమే-అయిదవదైన సుప్రతిష్ఠాఛందం మొదలు మిగిలిన ఛందాలన్నింటికీ ఏకోత్తరాధికంగా పాదాలు రూపొందినప్పుడే చతురశ్రం యేర్పడుతుంది-అప్పుడే చౌకంలో చూడాలనుకునే సౌందర్యం కనిపిస్తుంది. ఈ పద్ధతి వల్ల పద్య చతుష్పాద స్వరూపానికి-నిర్ణయానికి-పూర్తిగా భంగం యేర్పడుతుంది.

కాగా చతురశ్ర సౌందర్య దృష్టిలో పద్యాలకు నాలుగు పాదాలు నిర్ణీతాలయ్యా యనడంలో వాస్తవికత గోచరంకాదు -

కృతత్రేతాద్వాపర కలినామకాలైన చతుర్యుగాలున్నాయి. ఈ యుగాలకు నాలుగేసి పాదాలున్నాయి. కలికి నాలుగు రెట్లయితే కృతయుగం. ప్రాచీనులు పెట్టిన కొన్ని అధ్యాయాలలో నాలుగు పాదాలున్నాయి.—నక్షత్రాలకు నాలుగేసి పాదాలున్నాయి. చివరికి ఓంకారాన్ని కూడా నాలుగు పాదాలుగా విభజించారు. ఖగోళశాస్త్రపరంగా చతుస్సంఖ్యకొక విశిష్టత ఉన్నట్లు కనిపిస్తున్నది. అసలు "పాద"మంటే భాగం—అంశ అని మాత్రమేకాక నాల్గవ భాగమన్న అర్థం కూడా వున్నట్లు కనిపిస్తున్నది—ఈ చతుర్భాగమన్న అర్థాన్ని దృష్టిలో పెట్టుకునే "పాద" శబ్దంలోనుంచి నాల్గవవంతు అన్న అర్థంకల పాతిక(పాదిక) శబ్దం వికృతిగా అవతరించి నిత్యవ్యవహారంలో నిలచినట్లు కనిపిస్తున్నది. ఈ దృష్ట్యా చూచినా నాలుగవ భాగమన్న అర్థంతో చూచినా "పాద" శబ్దం పద్యాలలో అన్నిచోట్లా చెల్లనేరదు—అర్థసమవిషమాది పద్యాలలో అసలే చెల్లనేరదు.

పాదం అంటే ప్రాణికాలు—అడుగు అని మాత్రమే అర్థం కాక మనం కూర్చోనడానికి — వస్తువులు పెట్టడానికి కొన్ని పదార్థాలు చెయ్యడానికి సామాన్యంగా చెక్కతో రకరకాల పీటలు తయారుచేస్తారే ఆ పీటలకుండే కాలును కూడా పాదం అనే అంటారు—పీటకు కాళ్లు (కోళ్లు) రెండుగాని మూడు గాని నాల్గు—అయిదు—ఆరు—ఏడు—ఎనిమిది ఎన్నైనా వుండవచ్చును. పీటకు మూడు కాళ్లంటారేమిటా అని చటుక్కున సందేహించనక్కరలేదు. మూడు కాళ్ల పీట వుంటుంది. దీన్నే ముక్కాలిపీట అంటాం. సంస్కృతంలో దీన్ని త్రిపాదిక అంటారు. "త్రిపాద" అని అన్నా అనవచ్చు. నాలుగు కోళ్లున్న పీట లెలాగో వుంటాయి గదా! — పీటల పొడవు వెడల్పులనుబట్టి—అవసరంకొలదీ—నాలుగుకుమించి యెన్ని కోళ్లైనా అమర్చవచ్చుగదా ! పద్యాన్ని ఒక పదార్థ భావాదికమయమైన పీఠంగా భావించినప్పుడు ఆ పీఠానికున్న కాళ్లుగా (కోళ్లుగా) పాదాలను భావించవచ్చు—ఈ దృష్ట్యాద్విపద — త్రిపద—చతుష్పద—పంచపద—షట్పద—సప్తపదాదులన్నీ (వృత్తాలన్నీ) పాదార్థ దృష్టితో సంఖ్యాపరిమితిలో ఏకవాక్యత—సమన్వయాలకు లోనవుతాయి.

పదం (పాదం—కాలు—అడుగు) కలది పద్యం లేదా పదం కావచ్చునుగదా ! పదమంటే అడుగు—అడుగు అన్నప్పుడు కేవల పాదనామకమైన అడుగు-చరణం అని మాత్రమే మనం అనుకోనక్కరలేదు. పదమంటే పాద నిక్షేపం-చరణ నిక్షేపం—అనగా పాదన్యాసం—విన్యాసం— అడుగుతీసి అడుగువేయడం — అడుగు ఉంచడం అన్న అర్థం కూడా చెప్పవచ్చు—కాగా ఎన్ని పాద విన్యాసాలుంటే అన్నింటికే ఆ సంఖ్య పరిమితమవుతుంది కాబట్టి వివిధ సంఖ్యాత్మకాలైన పాదాలు గల పద్యాలన్నీ పరిగ్రాహ్యాలవుతాయి—పల్లవిచరణ రహితాలైన మాత్రా చ్ఛందస్సులు గల పాటలు కూడా పరిగ్రాహ్యాలవుతాయి. ఎన్ని అడుగులు వేస్తే (పాదన్యాసాలు చేస్తే) అన్ని పాదాలు లెక్క కాబట్టి అన్ని పాదాలతో ఉద్దిష్ట పద్యం పూర్తి అవుతుంది.

పాద విన్యాసాన్ని దృష్టిలో పెట్టుకునే వృత్తాదుల పాదవ్యవస్థను ప్రాచీన కాలంలో సంస్కృత లక్షణకారులు—వేదజ్ఞులు—యేర్పరచారనిపిస్తున్నది—ఈ దృష్టి ఉండబట్టే పద్యంలో అంటే సంస్కృత శ్లోకంలో ఏ పాదానికి ఆ పాదం పద విచ్ఛేదంతో తెగిపోవాలని నియమం పెట్టి దీనికి పాదాంతం అని పేరు పెట్టారు. ప్రాణి నడుస్తున్నప్పుడు అడుగు తీసి అడుగు వెయ్యడంలో—ఒకదాని తరువాత ఒకటిగా అడుగు వెయ్యబడుతున్నా—అడుగులు వెయ్యడంలో అనుస్యూతత వుంటున్నా అడుగుల మధ్య—స్థలావకాశం పూర్తిగా వుంటుంది. పదన్యాస విచ్ఛేదం తప్పక దేనికదిగా జరుగుతుంది. కాగా యీ అడుగుల వ్యవస్థను దృష్టిలో పెట్టుకుని పాదాంత పదవిచ్ఛేదంతోసహా పాదభాగాన్ని సంస్కృతభాషాఛందో రహస్యజ్ఞులైన మహర్షులు యేర్పరచినట్లు కనిపిస్తున్నది.

తెలుగులో పాదవిభాగం ఉన్నా నిత్యంగా పాదాంత పద విచ్ఛేద పూర్వక మైన నియమం—పద్యపాదాంతం పదాంతమై "తరువాతి పాదంతో లంకెలేకుండా విచ్ఛేదాన్ని పొంది తీరా"లన్న నియమం లేకపోవడంవల్ల—పదవిన్యాసక్రమ వ్యవస్థకు భిన్నత్వం యేర్పడినప్పుడు యేరూపంగానూ సార్థకత లభించదు. పాదాంతంలో పదం విచ్ఛేదంకాకుండా శబ్దం తొలుతనో మధ్యనో పాదం ముగిసి ఆ ముగింపు పదాక్షరాలు—ఒకటి రెండుగాని అంతకు మించిగాని యెన్నైనా—తరువాతి పాదంలోకి వెళ్లాయంటే—అది—ప్రాణి అడుగువేసి—తీసి—తిరిగి తరువాత వేసే అడుగు తగు దూరంలో కాకుండా—అంతకుముందు వేసిన అడుగును వెన్నంటి—అంటిపెట్టుకుని వెయ్యడం వంటిది కాగలదు. మామూలుగా కాలుతీసి కాలువేసి నడవ వలసిన ప్రాణి తన అడుగులతో ఒక స్థలాన్ని కొలుస్తున్నప్పుడేవిధంగా అడుగుకూ—అడుగుకూ మధ్య ఖాళీ వుంచకుండా—అడుగునంటి అడుగులు వేస్తే ఆ అడుగులకెటువంటి అనుస్యూతమైన విశిష్టమైన అసహజమైన సంబంధం వుంటుందో అటువంటి సంబంధమే పాదాంత పదవిచ్ఛేదం జరుగని పద్యపాదాలలో కనిపిస్తుంది. స్థలాన్ని కొలిచేటప్పుడు అవసరాన్నిబట్టి విశిష్టంగా వేసే అడుగుల కొలతల పాదవిన్యాసం మానవునికి సహజసిద్ధమైందీ—స్వాభావికమైనదీ—సౌందర్య కారకమైందీ కానే కాదుగదా! కాగా తెలుగు కవులు ప్రవేశపెట్టిన పాదాంత పదవిచ్ఛేద రాహిత్యం [illegible] పాదవ్యవస్థకు భిన్నమైనదని తేలుతున్నది. పాదక్రమాన్వయకమైన అపాద వ్యవస్థకు [illegible] స్పష్టపడుతున్నది.

పద్యాల్లో పాదాన్ని పాదం అన్నా చరణం అన్నా ఒకటేనని ఆ రెండు పదాలు పద్య శాస్త్రంలో ప్రయోగితాలవుతున్నాయని యింతకు పూర్వమే గుర్తించాం. అయితే పాటల్లో కొన్ని పాదాలు కలిసి చరణం అనబడుతుంది—కొన్ని చరణాలతో పాట రూపొందుతుంది కాబట్టి పద్య సంబంధంగా పాద పరమైన యిచ్చిన యీ అర్థసమన్వయం చరణాలుగల పాటల పాదాలకు వర్తించదు. కొన్ని పాదవిన్యాసాలవలె చరణాల పాదాలను గ్రహించినా—యీ పాదాలతో చరణం పూర్తి రూపందాలుస్తుందిగాని పాట పూర్తి రూపందాల్చనేరదుగదా!—పాదాలతో పద్యం అయినట్లు పాదాలలో (పదం) పాట రూపొందదు—పాదాలుగల చరణంతో పాట రూపొందుతుంది. పాదం అంటునే చరణంకదా! చరణమంటే

పాదం (అడుగు) అని అర్థంకదా! మరి పాదాలుకలది చరణం అనడంలో ఔచిత్య మేముంది ? చరణంలో పాదాలుంటాయనడంలో అర్థమేమిటి ? అని యెవరైనా ఆక్షేపించగలరు. అందువల్లనే పద్య పాదాలపరమైన "పాద" శబ్దానికి—పాటల లోని చరణాలలోని పాదాల పరమైన పాదశబ్దానికి అర్థస్వరూప సందర్భాలలో సంబంధం సమన్వయం కుదురదని గతంలోనే పేర్కొనడం జరిగింది.

అయినప్పుడు చరణగతమైన భాగాలనుకూడా పద్యభాగాలను పాదాలన్నట్లే పాదాలుగా వ్యవహరించడానికి కారణం యేమిటన్న ప్రశ్న ఉదయిస్తుంది. "పద" శబ్దం పాదశబ్దానికి పర్యాయపదమని లోగడ వ్రాయడమేకాక పదములు కలది—పదసంబంధమైనది పాదం కావచ్చునని కూడా పేర్కొనడం జరిగింది. "పద" శబ్దానికి సంగీతశాస్త్రపరంగా "కళాస్థానభేదం" అన్న అర్థం వున్నది. విశిష్టతాళ పరమైన యీ కళాస్థానభేదాన్ని ఆర్షసంగీత సర్వజ్ఞులు "పదం" అని అంటారు. తత్పద సంబంధమైనది—అంటే తత్కళాస్థానానికి సంబంధించింది కాబట్టి "పాదం" గా పేర్కొనబడింది. పాదనామకాలైన కళాస్థానాలు—చరణానికి—రెండుగాని మూడుగాని నాల్గుగాని అంతకెక్కువగాగాని వుండవచ్చు—చరణానికి పాదాలుంటాయి. అని అంటే "కళాస్థానా"లుంటాయి అని అర్థం. కాగా శబ్దం ఒక్కటే అయినా పద్య భాగనామకమైన పాదశబ్దానికి—పాటలోని చరణభాగ నామకమైన పాదశబ్దానికి అర్థవ్యవస్థల్లోనే భిన్నత్వం వున్నదన్నమాట. అయినప్పుడు పద్య పాదాల వ్యవస్థకూ పాటల్లో చరణాంతర్గతమయ్యే పాదాల వ్యవస్థకూ సమన్వయంతోగాని ఏకవాక్యతతోగాని ఆవశ్యకత లేనేలేదని చెప్పవచ్చు—మరొక విశేషం పద్యపాదాల విషయంలో మనం గుర్తించవలసి వున్నది. కొన్ని పద్యాలు రాగాలకు—శ్రవణపేయమైన రాగాలకు—లొంగకపోవచ్చు. లొంగిన పద్యాల పాదాలకు—పాడడానికి—పాటలవలె రాగతాళలయయుక్తంగా పాడడానికి వీలైన పద్యాల పాదాలకు కూడా కళాస్థానం వుంటుంది. ఈ దృష్ట్యా పాటలలోని చరణాల పాదాలను—కళాస్థానార్థకపాద శబ్దవాచ్యాలుగా పేర్కొన్నట్లే పాడడానికి వీలైన పద్యపాదాలనుసైతం తత్కళాస్థానార్థక పాదశబ్దనామ నిర్దేశితాలుగా పేర్కొనవచ్చు.

జయదేవుని గీతగోవిందగత "అష్టపదు"ల్లోని "పదశబ్దనిర్దేశితాలు పాదాలూ కావు- చరణాలూ కావు. అష్టపదాలు (పాదాలు) ఉన్నాయి కాబట్టి అష్టపది అనబడిందని పేర్కొందామా అంటే వాటిల్లో చరణలక్షణం వున్నట్లు కళాస్థానాత్మకమైన తాళలయాన్వితమైన పాదవ్యవస్థ వున్నట్లూ కనిపిస్తున్నది. పోనీ పాదాత్మకాలైన చరణాలే యెనిమిది ఉన్నాయందామా అంటే "పద" శబ్దానికి చరణంఅని అర్థంచెప్పి "అష్టపది" యెనిమిదిచరణాలుకలదిఅని అర్థంచెప్పాలి—ఎనిమిది పాదాలుకలది అని అర్థం చెప్పనేరాదు. అయినప్పుడు త్రిపది షట్పదుల వంటిది "అష్టపది" కానేరదు. పద్యాత్మకాలైన అష్టపదులు – గీతాత్మకాలైన అష్టపదులు విభిన్నాలనుకుంటే యే యిబ్బందీ ఉండదు–

# తెలుగులో పదవాఙ్మయం

చిలవలు పలువలుగా జానపదుల్లో సైతం తరతరాలుగా మూడుపూవు లారు కాయలుగా విలసిల్లిన గేయరూపమైన పదవాఙ్మయం తెలుగులో యెప్పుడు ప్రారంభమైనదో చెప్పలేము. నన్నయ నన్నెచోడులకంటే బాగా పూర్వమే అవతరించిందని చెప్పవచ్చు. పాల్కురికి సోమనరచనలవల్ల ఆతని కాలంలో గానం చెయ్యబడే పదరచనలు కొన్ని తెలుస్తున్నాయి. ఆ రచనలనామాలు–నామాలవల్ల కొన్నిటి స్వభావంమాత్రమే మనకు అవగాహనఅవుతున్నదిగాని అసలు వాటి స్వరూపం యెటువంటిదో గుర్తించడానికి అవి కావ్యాలవంటి యితర రచనలవలె మనకు వ్రాతలో లభ్యంకాలేదు. గేయసాహిత్యం ప్రారంభమైనతరువాత దాదాపు ఆరేడువందల సంవత్సరాలవరకూ మనకు వాటి స్వరూపం ఒక పద్ధతిలో లభ్యంకాలేదు. బహుముఖాలుగా అవతరించిన పదాలలో సంకీర్తనాపరాలైన పదాలు అన్నమాచార్యరచనలు మనకు లభించాయి. అన్నమాచార్యులు యితర రచనలతోపాటు కేవలం శృంగారసంకీర్తనలేకాక–అధ్యాత్మసంకీర్తనలుకూడా రచించాడు. "పదకవిత" శబ్దార్థంతెలియనివారికి పద్య–గేయ రచనలు ఒక కోవకు చెందినవేనన్న జ్ఞానంలేనివారి అంధత్వాన్ని రూపుమాపడానికి సంస్కృతంలో "సంకీర్తనలక్షణం" అని ఒక లక్షణగ్రంథం సృజించాడు. అన్నమాచార్యులేకాక అతని అర్ధాంగి తిమ్మక్క, వారివంశీయులు చినతిరుమలాచార్యులు–చిన్నయ్య–తిరువెంగళనాథుడు–తిరువెంగళప్ప–పెదతిరుమలాచార్యులు–శ్రీనివాసాచార్యాదులు కూడా వివిధ పదకవితాకర్తలుగా వెలుగొందినవారే. అన్నమాచార్యులు మొదలు 19 వ శతాబ్ద్యంతంవరకేకాదు నేటివరకూ పదకవిత బహుముఖమై విస్తృతంగా అవతరిస్తూ నేఉన్నది. అన్నమయ్యతరువాత అమేయమై అపూర్వమైన సహస్రాల కొలది అమృతరసపద పదాలను ధారావాహికంగా వెలయించిన క్షేత్రయ్యకు తెలుగు పదవాఙ్మయంలో మకుటాయమానమైన స్థానంఉన్నది. క్రీ॥ శ॥ 15వ శతాబ్దంమొదలు 19వ శతాబ్దిచివరివరకూ పోలుగంటిచెన్నశౌరి, చక్రపురి రాఘవాచార్య, కందుకూరి రుద్రకవి, శేకుమళ్ల రంగశాయి, బాలపాపాంబ, పరమానందతీర్థయతి–రామబ్రహ్మయోగి – నిముషకవిరామయ్య, శేషాచలకవి, ఉదయాచలకవి, ప్రభృతికవులు ఆంధ్ర తెలంగాణాప్రాంతాలలో ఏదోఒక రూపంలో పదకవితను వెలయించినవారే–దక్షిణాంధ్రదేశంలో క్రీ॥ శ॥ 17 వ శతాబ్దిపూర్వంనుంచీ రఘునాథనాయకుడు, విజయరాఘవనాయకుడు, రంగాజమ్మ–పురుషోత్తమదీక్షితుడు– కోనేటిదీక్షితచంద్రుడు, మన్నారుదేవుడు–చల్లసూరయ–పెదకేశవరాయడు–శంకీరవవదనరాజు–నారాయణతీర్థులు–శహజీ–వాసుదేవకవి, నివర్తిశేషాచలపతికవి–శరభోజీ–తుక్కోజీ (తుళుజరాజు)–బాలకవి సుబ్బన్న–రామకవి–శర్భాగిరిరాజకవి–అన్నదానం వెంకటాంబ–తిరుమలకవి–ఏకోజీ–భాస్కరశేషాచలకవి – ఆలూరికుప్పన్న – పిన్నబయలాచార్యులు – నుదురుపాటి వెంకన్న–మాతృభూతకవి–మెరట్టూరు వెంకటరామశాస్త్రి–త్యాగరాజు–శివాజీ – ప్రభృతిగాగల కవులనేకులు పెక్కురీతులలో పదసాహిత్యాన్ని వివిధ సందర్భాలలో రచించారు. క్రీ॥ శ॥ 15 వ శతాబ్దంమొదలు క్రీ॥ శ॥ 19 వ శతాబ్దంచివరివరకూ

ఆంధ్రసంస్కృత తమిళ కన్నడ హిందీ మహారాష్ట్ర మొదలైన భాషలలో బహు ముఖంగా సంకీర్తనాపరమైన పదరచనలు అనేకమంది విరచించారు. అన్నమాచార్య ప్రభుతులు—క్షేత్రజ్ఞాదులవలె అణ్ణాచ్చి అయ్యర్—అమృతలింగంపిళ్లై గిరిరాజు—రామరాజు—త్యాగరాజాదులవలె చిరస్మరణీయులై సంస్కృతాది భాషలలో ప్రవీణులై సంగీతకళాశాస్త్ర పారంగతులై విలసిల్లినవారు సాధారణంగా సాహిత్యప్రపంచానికి తెలియకుండా మరుగునపడిఉన్నవారు పెక్కుమందిఉన్నారు. పురందరదాసు చండీదాసు ప్రభృతులు సుప్రసిద్ధులే—కేవల సంగీతప్రపంచానికి అందులోనూ పరిశోధకులకుతప్ప లోకానికి తెలియనివారు వెంకటరమణదాసు—వెంకటస్వామినాయుడు—వెంకటరమణయ్య - కోటేశ్వరయ్యర్—అరాణఅప్పయ్య—అయ్యాభాగవతార్—ప్రభృతులు అందరెరిగినవారుకారు. నారాయణతీర్థుల కోవలో చేర్చవలసినవారు పెక్కురున్నారు. తంజావూరు రామారావు—లక్ష్మీకాంతమహారాజు - అచ్యుతనాయక్ - కార్వేటినగరం గోవిందస్వామయ్య - కూవనస్వామయ్య - పైడలగురుమూర్తిశాస్త్రి - రామానందయతీంద్రులు—గోవింద దీక్షితార్—చంద్రశేఖరసరస్వతి - చిదంబరనాథయోగి - అణ్ణాచ్చిఅయ్యర్ - అమర సింగ్ మహారాజా—ఆదియప్పయ్య—గోపాలయ్యర్—చిన్నస్వామిదీక్షితర్—చొక్కనాథ నాయర్—అనంతపద్మనాభస్వామి - ఆదిమూర్తిఅయ్యర్ - చల్లగాలికృష్ణయ్యర్ - గోపాలకృష్ణభారతి - తంజావూరుచిన్నయ్య - చిన్నస్వామిదాసరి - దురైస్వామి అయ్యర్—గణేశయ్యర్—వెంకటరమణభాగవతార్ - మొదలైనవారు భద్రాచల రామదాసు—త్యాగరాజులవలె తెలుగు తమిళాదిభాషలలో క్రీ॥ శ॥ 1500—1880 మధ్యకాలంలో దక్షిణాంధ్రప్రాంతాలలోజీవించి పదవాఙ్మయాన్ని నిర్మించి గానం చేసి తనియించి తరియించినవారే—వీరిలో పెక్కురు తెలుగు—తమిళం—తెలుగు—కన్నడభాషలలో రెండిటా వైదుష్యం కలవారై సంకీర్తనరచనాగాన మహా వైభవాన్ని మూడుపూవు లారుకాయలుగా పరిపోషించినవారే—

ప్రాచీనకాలంలో భక్తిపదాలు—ఆధ్యాత్మికపదాలు అవతరించినట్లే నీతి పదాలు—హాస్యపదాలు—శృంగారపదాలు—వివిధ స్తుతిపదాలుకూడా అవతరించాయి. దేవతలనుస్తుతియిస్తూ పాటలు వ్రాయబడినట్లే రాజులను వారి సామంత ప్రభువులను మంత్రులను స్తుతియిస్తూకూడా పాటలు వ్రాయబడేవి.

ఆంధ్రనాయకరాజులు తమ పరిపాలనాకాలంలో కవిపండితులను అనేక మందిని ఆదరించి పోషించి సంస్కృత — దేశభాషాసాహిత్యాలను పరిపరివిధాల పోషించారు—నాయకరాజులతరువాత తంజావూరు రాజధానిగా దక్షిణాంధ్రాన్ని పరిపాలించిన మహారాష్ట్రప్రభువులుకూడా నాయకరాజులకు దీటువచ్చేట్లుగానే సంస్కృతి—దేశభాషాసాహిత్యాలను కవిపండితులను పరిపోషించారు—మరింత ప్రశంసనీయంగా మనం చెప్పుకోవలసిందేమంటే శాహజీ ప్రభృతులు మహారాష్ట్రీయులే అయినా తాము స్వయంగా సంస్కృతంతోపాటు ఆంధ్రాది దేశభాషలను నేర్చుకుని పాండితీగరిమను సంపాదించి రచనలుచేసి కవిరాజులుగా వెలుగొందడం — నాయకరాజులకాలంలోగాని ఆతరువాత మహారాష్ట్రరాజుల కాలంలోగాని వెలసిన భిన్న భిన్న రూపాలలో అవతరించినపదాలు వివిధ గ్రంథాల

రూపంలోగాని సంకలనం పద్ధతిలోగాని ఏ వైతేనేమి మొత్తం 40 గ్రంథాలుపైగా తంజావూరుసరస్వతీమహలులో ఉన్నాయి. ఈ 40 గ్రంథాలలోనూ వివిధపదాలు యీ క్రిందివిధంగా ఉన్నాయి.

(1) త్యాగరాజస్వామి కీర్తనలు—M. 693 A. ఒకటి–.
(2) క్షేత్రయ్యపదాలు–B. 11522 C. ఒకటి–.
(3) త్యాగేశపదాలు–B. 11187-M. 175-B. 11630 మూడు.
(4) వెంకటేశపదాలు–B. 11658-M. 174. M. 40 మూడు.
(5) ఇతర కీర్తనలు—B. 11652 ఒకటి.
(6) పాటలు–M. 694-B. 11605 D మొత్తం మూడుప్రతులు.
(7) వర్ణములు గీతములు—B. 11612 ఒకటి
(8) స్వరజతి–B. 11605 ఒకటి—.
(9) శాహాజీయము. శాహరాజసాహిత్యము (ఈ పేరుతోకూడా పాట లున్నాయి)- B. 11628-B. 11635-B. 11627- పేర్లతో మొత్తం మూడు ప్రతులు-
(10) కీర్తనలు (శృంగారమయాలుకూడా)-B. 11652 ఒకటి—.
(11) నానావిధకీర్తనలు-పదములు — గీతములుగా- M. 14 - M. 42 - B. 11662 - B. 11661 - B. 11660 - M. 24 ఆరుప్రతులు-
(12) నీతిపదములు - B. 11663 - B. 11665 - B. 11664 మూడు —.
(13) పదములు — B. 11643 - B. 11606 - B. 11641 - B. 11647 - B. 11638 - B. 11636 - B. 11644 - B. 11634 - B. 11640 - M. 136 - M. 482 - B. 11521 - B. 11648 - B. 11646 - B. 11639 - B. 11657 - M. 694 ప్రతులు పదిహేడు —.
(14) శృంగారపదములు- B. 11632 ప్రతి ఒకటివంతునా ఉన్నాయి–.

13 వ సంఖ్యగాయిచ్చిన 17 ప్రతుల్లో చివరిమూడు ప్రతుల్లోనూ కీర్తనలుకూడా ఉన్నాయి–M. 136 ప్రతిలో శృంగారపద్యాలున్నాయి–.

వీటిలో కొన్నిటి రచయితలు త్యాగరాజాదులన్న సంగతి తెలుస్తున్నది- ప్రస్తుతం ప్రకటితమవుతున్న గ్రంథంలోని తొలిభాగంగా ఉన్న పాటలు—B. 11632 (14 సంఖ్య) ప్రతిలోనివి. రెండవభాగంగాఉన్న సీసపద్యాలు M. 136 ప్రతిలోనివి-

## కర్త యెవరు ?

రాగతాళశుద్ధి శబ్దశుద్ధిసౌష్ఠవముకలిగి ఉదాత్తస్థాయిలో వున్న యీ శృంగారపదాలను యెవరురచించారో చెప్పలేము. ఒక పడతి–లేదా కొందరు పడతులు కొన్ని కొన్ని పాటలు—యెవరికివారుగా పాడినట్లుగా ఉన్న యీ పాటలను ఒకానొక కవయిత్రియేరచించిందో కొందరు కవయిత్రులు రచించారో— కవులేరచించారో చెప్పలేము. కవయిత్రులు యింతగా శృంగారరస సంభరితాలైన

పదాలు రచియించగలరా అని మనం సందేహించనక్కరలేదు–విజయరాఘవుని కాలంలో శబ్దశక్తికల రచయిత్రిగా వెలిగి కనకాభిషేక్త అయిన పసుపులేటి రంగాజమ్మ విచిత్రతర పత్రికాశత లిఖితవాచికార్థావగాహనప్రవీణ, శతపత్రికాశత స్వహస్తలేఖన ప్రశస్తకీర్తికలదేకాదు అతులితాష్టభాషాకవిత సర్వంకషమనీషా విశేషశారదమాత్రమేకాదు–రాజనీతి విద్యావిశారదమాత్రమే కాదు. "శృంగారరసతరంగిత పదకవిత్వమహనీయమతి స్ఫూర్తి విద్వత్కవి జనస్తవనీయ–" అనికూడా పేర్కొనడం జరిగింది. ఇంతటి మహనీయమతి స్ఫూర్తి ఒక్క రంగాజమ్మమాత్రమేనని మనం యెందుకు భావించాలి? ఇటువంటి కవయిత్రులు ఏకోజీ శాహజీ శరభోజీ–తుళుజరాజులకాలంలోకూడా వుండి వుండవచ్చునుగదా!–అయితే యీ పదాలు కేవలం కవయిత్రులేరచియించి వుంటారని చెప్పలేము. వివిధకావ్యాలలో పగుసందర్భాలలో స్త్రీ విరహాది వర్ణనలను స్వ స్వానుభూతిగల పడతులవలెనే కవయిత్రులవర్ణనలను మించి భావించి కవులు వర్ణించలేదా! అదేవిధంగా పడతులుపాడినట్లున్న యీ శృంగారపదాలను ఎవరో ఒకరిద్దరుగాని మరికొందరుగాని కవులే రచియించినారచియించివుండవచ్చును. సరస్వతీమహాలులోనే ఉన్న "పదములు" మూడుప్రతులలోగల చివరపాటలో "గిరిరాజకవినుత–గిరిరాజనుత" శబ్దాలు ఉపయోగింపబడ్డాయి.

— పాయకగింగవాడి నాపైనివేయకు మొక్కెద
మాయత్త కోపగత్తెరా
గిరిరాజకవినుత శరభోజనృపా! నన్ను
మరునికేళిగూడ వేరా —
(B. 11638–చివర)

—"చేరరాకురా శాహజేంద్రా చేర రాకురా
చేరరాకురా చెలువుడ! యిప్పుడు మావాటుచూడబో యేరు
(పుస్తకప్రారంభం)
నిందావార్తలు యిందూగిరిరాజనుతుండు
అందముగినూ
(B. 11636—పుస్తకంముగింపులో)

—"సదయుడగిరిరాజనుత! నీ రొమ్మున
చెదరిసగంధమందము
మదమున శాహేంద్రముగుదను గూడినచందము
(B. 11634 పుస్తకంతుదిపాటలో)

శాహజీ శరభోజీలపేర్లు పేర్కొనబడిన యీ పాటలు గిరిరాజకవినామ సంకలితాలైవున్నాయి. కాగా పీటికర్త – సుప్రసిద్ధకీర్తనకర్తఅయిన కాకర్ల

త్యాగరాజుకు తాత అయిన గిరిరాజకవిఅని స్పష్టపడుతున్నది. "పాయక గంధమిడి" ఇత్యాది పదాన్ని గుర్తిస్తే గిరిరాజకవి యీ "శృంగారపదాల" వంటి పదాలు రచియించినట్లు స్పష్టపడుతున్నది—ఈ గిరిరాజకవి తంజావూరులో రెండవ శహాజీ ఆస్థానంలోను అతనితరువాత పరిపాలకులైన అతనిసోదరులు శరభోజీ—తుక్కోజీ (తులుజ) ల ఆస్థానంలోనూ కవిపండితుడుగావున్నాడు. ఈ పదాలను గిరిరాజకవి రచియించాడేమో చెప్పలేము.

ఈ పదాలలో అన్నీ ఒకేఒక్కరాజునుద్దేశించి వ్రాసినవికావు- ఏకోజీమీద (సామి దయజూడుమీవేళ—16 పుట) శాహజీమీద (కాని కానరానివగలెల్ల 25 పుట) శరభోజిమీద (ఇదిసమయమురా, దయజూడరా—3వ పుట) పెక్కుపదాలు తులుజ రాజుమీద ఉన్నాయి—అయితే "తులుజ" శబ్దం ఏకోజీ – శాహజీ – శరభోజీ—తుక్కోజీలకు అందరికీ ఉపయోగింపబడింది. ప్రస్తుతగ్రంథంలో ముద్రితాలైన పదాలు మొత్తం 68—చిట్టచివరిపదాలు మూడూ (30—31 పుటలు) మంగళ హారతులు.—11–12 పుటల్లోఉన్న "తరుణిరో !" ఇత్యాదిపదం ఒకానొక పడతి నుద్దేశించి ఏకేంద్రవినుతుడైన తులుజరాజుపాడినది. ఈ సంకలనగ్రంథంమొత్తంలో పురుషుడుపాడినపదం యిది ఒక్కటిగానే కనిపిస్తున్నది. 15వ పుటలోఉన్న "కోపముసేయకే" ఇత్యాదిపదం ఒక యువతినుద్దేశించి ఆమె సఖి పాడినది. 19వ పుటలోని "చూడవెరామ !" ఇత్యాదిపదంవల్ల తులుజరాజు శృంగారచేష్టలు వ్యక్తీకరింపబడ్డాయి. 23వ పుటలోని "కోలన్న కోలన్న కోల" ఇత్యాదిపదంలో తులుజరాజు కేవలం మనసుమీద మార్కండేయునివలె రావడం వర్ణించబడింది. ఈ పదంచివర "సామితులుజేంద్రుండు" తరువాత తిరిగి "కోలన్న కోలన్న" చరణం పునరావృత్తమవుతుంది. 14వ పుటలోని "మనసుఒకటిగానుంటే" ఇత్యాదిపదంలో చక్కని దూరదృష్టికల విశాలహృదయులవడం నీతి బోధచేయ బడింది. 29వ పుటలో "పొట్టనిమిత్తము ఇనులుపోటీచేసేరు" ఇత్యాదిపదంలో ఈర్ష్యాద్వేష సంకలితులైన పరాన్నభుక్కుల లంచగొండులను ఆస్మవంచకులను దూషించడం జరిగింది. ఈ ఆరుపదాలు తప్ప మిగిలినపదాలన్నీ శృంగార రసాత్మకాలే.

## ధాతు—మాతువులు

"ధాతువు అంటే సంగీతాత్మకమైన నాదబంధం-మాతువుఅంటే సాహిత్యాత్మక మైన శబ్దబంధం. శబ్దబంధం యే గురులఘువుల క్రమంలోసాగిందో నాదబంధంకూడా సరిగ్గా అదే గురులఘువుల క్రమంలో సాగేటట్లు పాడేపద్ధతిని మాతుప్రధానగాన పద్ధతి—మాత్రల గుణకభాగహారముల ద్వారా ఒక తాళంలోనిపాటను తాళగతులు మార్చిపాడడం నాట్యకళాకారులకు అనుభవైకవేద్యం—అప్పుడు గురులఘువుల స్వభావాలు కొద్దిగా మారతాయి—అప్పుడది ధాతుప్రధానమవుతుంది." అని కొందరంటారు.

ఒకతాళంలో ఉన్న పాటను మరొకతాళంలోకి మార్చిపాడడం అనుభవైక

వేద్యంమాత్రమేకాదు. అల్పాల్పతాళజ్ఞానం వున్నవారికెవరికైనా వేద్యమే అవుతుంది. తాళజ్ఞానంలేనివారైనా తాళంమార్పులవివరాలను చెప్పలేకపోవచ్చును గాని—మార్పువచ్చినవిషయం గుర్తించగలరు.

శార్ జ్గదేవుడు వాగ్గేయకారలక్షణంచెప్తూ
వాఙ్మాతురుచ్యతే గేయంధాతురిత్యభిధీయతే
వాచంగేయంచకురుతేయః సవాగ్గేయకారకః॥
అన్నాడు – అనంతరం శబ్దానుశాసనజ్ఞానాదివిషయాలుచెప్పి
అనుచ్ఛిష్టోక్తి నిర్బంధోనూత్నధాతువినిర్మితిః॥
పరచిత్తపరిజ్ఞానం ప్రబంధేషుప్రగల్భతా
ద్రుతగీతవినిర్మాణం పదాంతతవిదగ్ధతా॥
త్రిస్థానగమకప్రౌఢిః వివిధాలప్తినైపుణమ్
అవధానంగుణైరేభిర్వరోవాగ్గేయకారకః॥
విదధానోధికంధాతుంమాతుమందస్తుమధ్యమః
ధాతుమాతువిదప్రౌఢః ప్రబంధేష్వపిమధ్యమః॥
రమ్యమాతువినిర్మాతా ప్రథమోమందధాతుకృత్
వరోవస్తుకవిర్ వర్ణకవిర్మధ్యమఉచ్యతే॥
కుట్టికోరోన్యధాతౌతు మాతుకారః ప్రకీర్తితః
అనికూడా వక్కాణించాడు.
నిబద్ధమనిబద్ధంతద్ ద్వేధా నిగదితంబుధైః
బద్ధం ధాతుభిరంగైశ్చనిబద్ధమభిధీయతే

అని అనంతరం ప్రబంధ—వస్తు-రూపక నామాలతో నిబద్ధసంజ్ఞాత్రయాన్ని పేర్కొని యీ క్రిందివిధంగా ధాతుభేదాలు పేర్కొన్నాడు శార్ జ్గదేవుడు.

ప్రబంధావయవోధాతుః సచతుర్ధానిరూపితః
ఉద్గ్రాహః ప్రథమస్తస్తతోమేలాపకధ్రువౌ॥
ఆభోగాశ్చేతి తేషాంచక్రమాల్లక్ష్మాభిదధ్మహే
ఉద్గ్రాహః ప్రథమోభాగస్తతో మేలాపకస్స్మృతః।
ధ్రువత్వాచ్చధ్రువః పశ్చాదాభోగస్త్వంతిమోమతః
ధ్రువాభోగాంతరే జాతేధాతురమ్యోన్తరాభిధః॥
సతుసాలగసూడస్థరూపకేష్వేవదృశ్యతే
వాతపిత్తకఫాదేహధారణాద్ధాంతమోయథా
ఏవమేతేప్రబంధస్యధాతవో దేహధారణాత్।

ప్రతిపాద్యవిశేషంవల్ల రసాలంకారభేదంచేత సాహిత్యంలో (మాతువులో) నూతనత్వం యేర్పడుతుంది. లయగ్రహణవిశేషంవల్ల తాళాలకు నూతనత్వంవస్తుంది. తాళవిశ్రామంలో విశేషవిశ్రామస్థితిఉంటే లయకు నవత్వం సమకూరుతుంది. ఈవిధంగానే రాగాంశభేదంచేత ధాతువుకు—ధాతు మాతు తాళలయాదులకు సైతం నవత్వంరావచ్చును. రూపకప్రబంధాలగురించి సంగీతరత్నాకరకర్త వివరిస్తూ "గుణాన్వితందోషహీనం నవం రూపకముత్తమమ్" అని పేర్కొని ధాతుమాత్వాదుల నవత్వంగురించి యీవిధంగా ఉటంకించాడు.

రాగేణధాతుమాతుభ్యాం తథాతాలలయోడుపైః
నూతనైః రూపకంనూత్నంరాగః స్థాయాంతరైర్నవః।
ధాతూ రాగాంశబేదేన మాతోస్తు నవతాభవేత్
ప్రతిపాద్యవిశేషేన రసాలంకారభేదతః।
లయగ్రహవిశేషేణ తాలానాంనవతామతా
తాలవిశ్రామతోన్యేన విశ్రామేణలయోనవః।
ఛందోగణగ్రహన్యాస ప్రబంధావయవైర్నవైః
ఔడుచాపరపర్యాయాంచనానవతాంవ్రజేత్।

అసలు వాస్తవికతకు లోతుగా పరిశీలిస్తే శార్ఙ్గదేవుడు ధాతు మాతు స్వభావ వివేచనం తులనాత్మకంగా సమగ్రదృష్టితో చేసినట్లు కనపడదు—ధాతు శబ్దానికి ఉన్న అర్థాలలో గైరికాదిధాతువులు—మణిశిలాద్యర్థాలను విడచిపెడితే మిగిలిన అర్థాలు ప్రత్యేకించి పేర్కొనదగినవి (1) శరీరసప్తధాతువులు—(2) పంచభూతాలు—(3) శబ్దస్పర్శరూపరసగంధపంచకం—(4) సప్తసంజ్ఞ—(5) ఆకాశం—(6) సంగీతం అన్నవి. స, రి, గ, మ, ప, ధ, ని, లు శబ్దగుణకాలే కాదు—శబ్దయోని అయిన ఆకాశ మూలకమైన నాదరూపంలవి — కాగా అవి సంగీతాభివ్యక్తీకరణలో ముఖ్యాలు.

సప్తస్వరాలుకాబట్టి ధాతుశబ్దానికి సప్తసంజ్ఞార్థం సంగీతందృష్ట్యా యేర్పడిందనే చెప్పవచ్చు—సరిగమాది సప్తస్వరాలుకూడా పంచభూతాత్మకాలే—

1. స—అగ్నిబీజం (స్ + అ = స—అగ్ని—వాయుబీజాలు)
2. రి—అగ్నిబీజం (ర్ + ఇ = రి—అగ్ని—అగ్నిబీజాలు)
3. గ—పృథ్వీబీజం (గ్ + అ = గ—పృథ్వి—వాయుబీజాలు)
4. మ—ఆకాశబీజం (మ్ + అ = మ—ఆకాశ—వాయుబీజాలు)
5. ప—వాయుబీజం (ప్ + అ = ప—వాయు—వాయుబీజాలు)
6. ధ—జలబీజం (ధ్ + అ = ధ—జల—వాయుబీజాలు)
7. ని—ఆకాశబీజం (న్ + ఇ = ని—ఆకాశ—అగ్నిబీజాలు)

కాగా ధాతుశబ్దానికి సంగీతార్థం—నాద—శబ్ద—సంగగానే కాక—యీ పంచభూతాత్మక స్వరసంపలితమైన అక్షరరూపంగా సైతం రావచ్చును. అన్నింటికంటె ముఖ్యమైనది శబ్దగుణకమై—శబ్దయోనిత్వాన్ని పొందిన—నానాకళకు—మూలమనదగిన ఆకాశార్థమే—మాతుశబ్దంకూడా "మాతృ" (కా) శబ్దార్థకంగా అవతరించిందే—ప్రత్యక్షరమూ మాతృకే—అక్షరాత్మకమైన శబ్దజాలం—శబ్దాత్మకమైన వాక్యాలు అన్నీ మాతృమూలకాలే—అక్షరాలన్నీ పంచభూతాలలో యేదో ఒక భూతానికిచెందినవే—కాగా సాహిత్యానికైనా పంచభూతాత్మకాలైన—నాదాత్మకాలైన—అక్షరాలే బీజాలు. మరి ధాతువుకైనా మాతువుకైనా మూలం ఒకటేనన్నమాట. అయితే ఒకటి వైజ్ఞానికమై నాదాత్మకమై మాతుభావాన్ని ఆవిష్కృతంచెయ్యగా రెండవది లౌకికశబ్దార్థ స్వ స్వభావాన్ని వ్యక్తంచేస్తుంది. మాతువుగాని మాతృభిప్రేత మయ్యే భావంగాని లేకుండా ధాతువుండనేరదు. ధాతుస్వరూపంద్వారా యేభావం అభివ్యక్తీకరించబడుతుందో తద్భావబంధురమైన మాతువు ఏదో ఒకరూపంలో (గేయరూపంలోనే ఉండనక్కరలేదు) హృద్గతమై ఉండితీరుతుంది. మాతు స్వరూపోచ్చారణంలో ధాతుస్వరూపం యే అల్పాల్పమాత్రంగానైనా వుండనే వుంటుంది.

అసలు సంగగానం త్రివిధాలు—(1) ధాతుప్రధానగానం (2) మాతుప్రధాన గానం (3) ఉభయ (ధాతు మాతు) సమప్రధానగానం—మాతు (సాహిత్య) గత భావాన్ని మాతుగాని రూపంగాకంటేకూడా అత్యధికంగా ధాతు (సంగీత)—అనగా రాగాదులద్వారామాత్రమే ఆవిష్కృతం చెయ్యడం ధాతుప్రధానగానం—లీలగా నామమాత్రంగా రాగతాళాలను దృష్టిలోపెట్టుకొని కేవల మాతువు (సాహిత్యం. ద్వారామాత్రమే మాతుగతభావాన్ని అభివ్యక్తీకరించడం మాతుప్రధానగానం) ధాతు మాతువులు రెండింటినీ సమఉజ్జీలుగా—హెచ్చులొచ్చులకు లోనుకాకుండా (తగుమాత్రమైన రాగాదులతో) తుల్యాత్మకాలుగా ఉండేటట్లు గానంచెయ్యడం ఉభయసమగానం—

మాతు నిర్మాణంలోఉన్న గురులఘువులకు—లేదా – మాత్రాసంఖ్యాత్మకతకూ తన్మాతు ధాతుస్వరూప మాత్రాపరిగణనకు భిన్నత్వం యెన్నడూరాదు. గానంలో సర్వసామాన్యంగా వచ్చే ప్లుతాత్మకమైనభేదం పరిగణనకురాదు. మాతుగతభావాన్ని మాతువుద్వారాకాక—ధాతువుద్వారా—రాగాదులరూపంగా ఆవిష్కృతంచెయ్యడం ధాతుప్రధాన గానలక్ష్యం దాని లక్షణమూఅదే—అంతేగాని గురువును లఘువుగాను—లఘువును గురువుగాను లాగి లాగి పీకి పీకి—కుదించి కుదించి—మాతుగత భావాన్నేకాదు—ధాతుగతమైన రాగతాళాల స్వభావాన్నే వికారంగా వెల్లడించడం ధాతు ప్రధానగాన లక్ష్యంకాదు. సాహిత్యాన్నేకాదు సంగీతాన్నికూడా సఫాచేయగల—మాతువిచ్ఛేదం—మాతుభావవిచ్ఛేదం చేయగల గానంచెయ్యడం—ధాతు ప్రధానగానధ్యేయంకాదు. శాస్త్రబద్ధమూకాదు. రాగతాళాలమార్పుతో మాతువులో పదానుగుణంగా పదవిచ్ఛేదం—విశ్రాంతి—పూర్వరాగానుగుణవ్యవస్థలకు భిన్నంగా—రూపొందడంసహజం. అంతమాత్రంచేత మాతువు గురులఘుత్వాల వ్యవస్థలో మార్పురానేరదు— ద్రుతాద్రుతగమనాలలోసైతం ఛందోపరమైన వ్యవస్థలో మాత్రాపరిగణనలో విభిన్నత్వానికి తావుండదు. "రామునితోక"—

వివరుండు గా—ధాతు ప్రధానగానంచేస్తే శాస్త్రమేకాదు సహృదయ సంగీతపండిత మండలేకాదు—రసజ్ఞ శ్రోతృజనమండలికూడా హర్షించదు—ఆమోదించదు.

## విశిష్టరాగాలు

ప్రస్తుత శృంగారపదాలలో అనేకరాగాలుపయోగింపబడ్డాయి. "నిన్నే నమ్మినానురా" ఇత్యాదిపదం (5 పుట) బృందావనిరాగంలో వ్రాయబడింది. ఇది యీ పదకర్తదూరదృష్టికి పరిశోధనాప్రక్రియకు ఒక మచ్చుతునక—సంగీత శాస్త్రాలలో "బృందావని"—"బృందావనసారంగ" అని రెండు విభిన్నరాగాలు పేర్కొనబడ్డాయి—ఇవిరెండూ ఒకేరాగానికున్న పేర్లని కొందరభిప్రాయపడ్డారుగాని అది సరికాదు.

—బృందావని—

ఆరోహణం——సరిమపనిస

అవరోహణ——సనిపమరిగిస

—బృందావనసారంగ—

ఆరోహణ——సగరిమపనిస

అవరోహణ——సనిపమరిగిస

త్యాగరాజు—"కమలాప్తకుల"ఇత్యాదికీర్తననూ—పట్నంసుబ్రహ్మణ్యఅయ్యర్ "సరసీరుహానన" ఇత్యాదికీర్తననూ—సరిమపనిస ఆరోహణగా రచియింపగా దీనిని "బృందావని" గా కొందరు గుర్తించలేక పొరపాటున "బృందావనసారంగ"గా భ్రమపడినట్లు స్పష్టపడుతున్నది. బృందావనికి "బృందావనసారంగ"కూ ఆరోహణలో ఉన్న భిన్నత్వాన్ని శాస్త్రజ్ఞులు గుర్తించవలసిఉన్నది. అయితే యివిరెండూ 22వ మేళకర్త అయిన "ఖరహరప్రియ" జన్యాలే—

"నేడు ముచ్చటజేసెనే నీరజాక్షివినవే" (27పు) అన్నపదానికి "ఘంటారవ" రాగం నిర్దేశితమైనది. దీనికి "ఘంటారావం" అనికూడా నామాంతరం ఉన్నది. "ఘంటారాగం—ఘంటాణరాగం—ఘంటారవరాగం" అని ఇవిమూడూ ఒకటేనేమో ననిపించేభ్రమకలిగించే నామాలేఅయినా ఒకటిమాత్రంకావు. "ఘంటారవం"—2వ మేళకర్తఅయిన 'రత్నాంగి' జన్యరాగంకాగా—"ఘంటా" 8వమేళకర్తఅయిన హనుమతోడి జన్యరాగమై—"ఘంటాణం" 57వ మేళకర్తఅయిన "సింహేంద్ర మధ్యమ" రాగజన్యం—

—ఘంటారవం—

ఆరోహణ——సరిగసమపనిస

(లేదా)——సగమనిధపధనిస

అవరోహణ——సనిధసమగరిస

"సామినయజూడుమీవేళ" — "నిన్నేనమ్మినానురా" — "కలకంటినేనొకటి" (16–17 పుటలు) పాటలకు "లాహరి"రాగాన్ని—"నాసామిగా నాపైకరుణింపరా"

(21 పుట) అన్నపదానికి "లక్షీ" రాగాన్ని అపూర్వంగా—వినూత్నంగా యీ అజ్ఞాతపదకర్త సమలంకృతంచేశాడు. కాపీ, సావేరి, ఓల్హారి, కన్నడ, ముఖారి, అసావేరి, సౌరాష్ట్ర, వసంత, అఠాణ-ధన్యాసి, బేగడ, తోడి, సారంగ, సురట-బృందావని—ఘంటారావం—వంటి రాగాలనూ-ఒకదానికొకటి పోటీగా-గౌరి కేధారగౌళి—పంతువరాణి పున్నాగవరాణి-భైరవి, వసంతభైరవి-కళ్యాణి, శ్యామకళ్యాణి-కాంభోజి ఎరుకలకాంభోజి, గుమ్మకాంభోజి—వంటి రాగాలనూ ఉపయోగించి వివిధ పదాలు రచియించిన యీ సత్పదకర్త-శబ్దసంగీతశాస్త్రాభిజ్ఞతకు కొదువలేని యీ సుపదకర్తనూతనరాగాలను వెలయించడంఅబ్బురమేమీకాదు.

ఈ శృంగారపదాల ద్వితీయభాగం సీసపద్యసంకలితం. తొలిభాగం సామాన్యంగా వలపుకత్తె (లు) పాడిన శృంగారపదాలుకాగా యీ మలిభాగం వలరాజువంటి వలపుకాడు—వెన్నెలకాడు-ఒక వన్నెలాడినుద్దేశించి చిలుకపలుకుల తెలుగు జిలుగువెలుగులుచాటు నుడులతో-తళుకుబెళుకులుదీటు తెలుగు నానుడులతో-తెలుగు ముచ్చట్లతో, వలపు కులుకులుచాటే పద్యాలతో నిండివున్నది. ఈ తెలుగువెలుగు పలుకుల వలపులచెలువుల తిలకించి పులకరింతలు మొలిచి పొంగి పొరలని తెలుగు ఒడలులు-తెలుగుగుండెలు ఉండనేఉండవు- మురిసి ముగ్ధతచెంది పరవశ్లుతొక్కని-గుండెలూవుండవు. విరిబోణులూ-నెరజాణలూవుండరు. ఈ పద్యాలు సమగ్రంగా లభించకపోవడం రసపిపాసువులకేకాదు—ఈ గ్రంథానికీ-శృంగారపదవాఙ్మయానికికూడా తీరనిలోపం-అయినా అందినపక్లే-పులుపుకావు-మరింత మధురాలేమో! మధురాతిమధురాలేమో!-తేనెసోనల పరిపాకరసగుళికల వంటి యీ సీసపద్యాలను వెలయించిన ఆ అజ్ఞాతకవి వల్లజుడెవ్వరో!

## ఆంధ్రులైన మహారాష్ట్రులు—
## కొన్ని చారిత్రక విశేషాలు

దాక్షిణాత్యాంధ్రసాహిత్యం నాయకరాజులఅనంతరం మహారాష్ట్రరాజులైన శాహజీ-శరభోజీ ప్రభృతులచేత గూడలోవలనే పరిపోషింపబడినట్లు చారిత్రకులు అనేకమంది పేర్కొన్నారు. విజయరాఘవభూపాలునివీరమరణానంతరం తంజావూరు మహారాష్ట్రరాజుల వశమైనదనీ అప్పుడు రాజ్యానికివచ్చిన ఏకోజీకుమారుడైన శాహజీ ఆంధ్రసంస్కృతాదిభాషల్లో స్వయంగా కవిపండితుడై పెక్కు గ్రంథాలు రచియించడమేగాక అనేకమంది కవులను పండితులను కళాకారులను ఆదరించి గౌరవించి కళాసరస్వతుల పరిపోషణచేసినట్లు పెక్కురు భావించారు. తంజావూరు రాజ్యాన్ని పరిపాలించిన నాయకప్రభువులలో చిట్టచివరివాడైన విజయరాఘవ భూపాలుడు క్రీ. శ. 1633 మొదలు క్రీ. శ. 1673 వరకూ పాలించాడు. ఈ నాయకరాజులు తాము స్వయంగా కవిపండితులవ్వడమేగాక కవిపండిత కళాకారుల పరిపోషకులుగా అమూల్యమైన కళాసాహిత్యసేవ చేసినమాట వాస్తవమే. ఇది క్షీణయుగమనో హీనయుగమనో అనిపించుకున్నదంటే అది వేరుమాట. నాయక రాజులకాలంలో కళాసాహిత్య పరిపోషణజరిగినట్లే వెనువెంటనే ఆ తరువాత యేర్పడిన మహారాష్ట్రరాజుల పరిపాలనలోకూడా జరిగిందనీ-అదికూడా-అను

స్వతంత్రంగా-అవిచ్ఛిన్నంగా జరిగిందనీ ఒక అభిప్రాయం చరిత్రసాహిత్య విమర్శకులలో యేర్పడివున్నది. ఇది సరికాదు. ఇంతేకాదు. ఏకోజీ దీపాంబికలపుత్రుడైన శాహాజీ క్రీ. శ. 1684–1712 మధ్యకాలంలో తంజావూరురాజ్యాన్ని పరిపాలించాడని అంటూనే యీ శాహాజీ క్రీ. శ. 1650 ప్రాంతంలో తంజావూరుకు తరలివచ్చి తెలుగునేర్చుకుని క్రీ. శ. 1704 ప్రాంతంలో గ్రంథరచన చేసివుంటాడని కొందరు పునర్విక్తంచేశారు. ఇందులోకూడా వాస్తవంలేదు. క్రీ. శ. 1684–1712 మధ్యకాలంలో తంజావూరు రాజ్యపరిపాలకుడై ఆంధ్రాదిభాషలలో అనేకరచనలు చేసిన శాహాజీ పేరుకు మహారాష్ట్రీయుడుగాని వాస్తవానికి ఆంధ్రుడే. ఈ శాహాజీ ఏకోజీ తాతముత్తాతలు మహారాష్ట్రులు. ఈ విషయంకాదనలేము. అయితే శాహాజీ శంభోజీ-తుక్కోజీల సోదరత్రయం మహారాష్ట్రులనడానికి అవకాశంలేదు- కాగా తుక్కోజీకి అనంతరం రాజ్యపాలనకువచ్చిన అతని పుత్రపౌత్రాది వంశీయులంతా ఆంధ్రులే అవుతారుగాని మహారాష్ట్రులుకానేరరు.

జాతి దేశీయతల నిర్ణయంలో మాతృత్వాన్ని ముఖ్యంగా పరిగణించడం జరుగుతున్నది. అందువల్లనే యెవరిగురించైనా వారి స్వభాషావిషయం తెల్సుకోవాలంటే "మాతృభాష యేది?" అని ప్రశ్నించడంజరుగుతుంది. సంతానం కలిగినతరువాత ఆ సంతానంతో తల్లికున్నంత నిత్యసాన్నిహిత్యం తండ్రికి ఉండదు. బిడ్డలకు ఉగ్గుపెట్టి -పాలిచ్చి-నీళ్లుపొయ్యడందగ్గరనుంచి సాకి విద్యాబుద్ధులు నేర్పడంలో నిత్యసన్నిహితంగా తల్లికుండేంతపాత్ర తండ్రికీఉండదు- సృష్టివ్యవస్థే యీవిషయంలో తల్లికనుకూలమైనది- అందువల్ల నిత్యసన్నిహితురాలైన తల్లినుంచే బిడ్డలు పలుకొట్టడం మొదలు ఉక్కు-ఉంగా దగ్గరనుంచి అత్త తాతలవరకేకాదు దాదాపు వ్యవహారాలుమాటలన్నీ సామాన్యంగా తల్లిదగ్గరే నేర్చుకోవడం జరుగుతుంది-తరువాత యేదియేమైనా తల్లినేర్పినభాషే ఆభాషలోని తొలితొక్కు పలుకే తొలుత తల్లినోటివెంటనే వెలువడి పిల్లలకు పట్టుమొదట అబ్బుతాయి. తల్లి-దాదిభాష బిడ్డలదగ్గరపాలతో నేర్పుతారుగదా! వచ్చినభాషే నేర్పుతుంది. కాగా తల్లిభాషయేదో ఆతల్లిబిడ్డల మాతృభాష అదే అవుతుంది- ఇది సామాన్య విషయమే. దీని కుటుంబవృత్తాంతమునకీ కొంతవిమర్శ జరుగుతున్నది- ఒక ఆంధ్రుడు ఒక తమిళయువతిని వివాహమాడుకొని ఆంధ్రదేశంలో స్థిరపడ్డాడనుకుందాం-అప్పుడు వారికి కలిగినసంతతి ఆంధ్రులా? తమిళులా? ఆబిడ్డలతల్లికి తెలుగువచ్చినా తమిళమే వచ్చినా కాని. తెలుగు-తమిళపదాలు అవికొన్ని యివికొన్ని తల్లి బిడ్డలకు నేర్పుతుంది. అయినా ఆసంతానాన్ని ఆంధ్రులంటామా తమిళులంటామా? ఒక తమిళస్త్రీ ఒక ఆంధ్రయువతిని వివాహమాడి ఆంధ్రదేశంలో స్థిరపడ్డాననుకుందాము. అప్పుడావారితులకు కలిగేసంతానం ఆంధ్రజాతికి చెందినదవుతుందా తమిళజాతికి చెందినదవుతుందా? ఇలాగే ఒక ఆంధ్రుడు తమిళస్త్రీని వివాహమాడి ఒక ఆంధ్రయువతి ఒక తమిళయువకుని వివాహమాడి వారు తమిళదేశంలో స్థిరపడ్డాననుకుందాము. వారికి కలిగేసంతానం తమిళాంధ్రజాతుల్లో దేనికిచెందినదని నిర్ణయిస్తాము. మానవుడెప్పుడూ తన పరిసరాల్లో చుట్టుపట్ల గౌరవప్రదంగా ఉన్న వేషభాషాసంస్కృతులను తానలవరచుకొని తనబిడ్డలకలవరచాలని

ప్రయత్నిస్తాడు-కాగా తాను నివసించే ప్రదేశ-దేశ-భాషాసంస్కృతులు బిడ్డల కలవడజేస్తాడన్నమాట-అంటే మాతృభాషానిర్ణయంలో మనదేశభాష అంటే తాను నివసిస్తున్న ప్రదేశభాషకూడా ఆధారభూతమవుతున్నమాట. మహారాష్ట్ర దంపతులు తెలుగుదేశంలో స్థిరపడ్డారనుకోండి. తాత్కాలికంగా వారు మహారాష్ట్రులైనా వారి పుత్రపౌత్రులు తెలుగుదేశంలోనే పుట్టిపెరిగినవారు. తల్లిభాషగా తెలుగునేర్చినవారు తెలుగువారే అవుతారుగాని మహారాష్ట్రులెలా అవుతారు ? నివాసప్రదేశవ్యవస్థకు మాతృభాషానిర్ణయంలో స్థానంలేకపోతే అసలు తరతరాలుగా ఒకవ్యక్తి-లేదా కొందరువ్యక్తుల తాతముత్తాతలు ఒకే రాష్ట్రంలో స్థిరంగాఉన్నారని అన్నిసందర్భాలలోనూ అందరివిషయంలోనూ ఖచ్చితంగా చెప్పలేరుగదా ! రాష్ట్రాన్నిబట్టి ఆ రాష్ట్రభాషనలవరచుకునే మానవునికి నివాస ప్రదేశ రాష్ట్రనిర్ణయంలేనప్పుడు—తరతరాలుగా యితని పూర్వవంశజులందరిదీ యిదే మాతృభాష అని యేవిధంగా ఒక భాషను నిర్దేశించిచెప్పగలం ? కాగా మాతృభాషానిర్ణయంలో పుట్టిపెరిగిన రాష్ట్రప్రదేశపాత్రకూడా ఉండితీరక తప్పదన్నమాట-ఈ దృష్ట్యా ఏకోజీతండ్రి నిశ్చయంగా మహారాష్ట్రుడనే చెప్పవచ్చు-ఏకోజీ ఆంధ్రదేశంలోనే పుట్టిపెరిగాడని నిశ్చయంగా చెప్పలేము. కాబట్టి అతనిని కూడా మహారాష్ట్రుడుగానే మనం పరిగణించవచ్చును. అయితే ఏకోజీ సంతతిని వారి పుత్రపౌత్రుల్ని తద్వంశీయుల్ని మహారాష్ట్రులుగా పేర్కొనే అవకాశంలేదు.

విజయరాఘవభూపాలుని అనంతరం మధురచొక్కనాథుని ఆజ్ఞప్రకారం ఆయన అండదండలతో చొక్కనాథుని తమ్ముడైన అళగిరిపరిపాలనలో నిలిచింది తంజావూరు. అయితే యీ అళగిరిపాలన ముచ్చటగా మూడుసంవత్సరాలైనా సాగలేదు. క్రీ. శ. 1676 లో ఏకోజీ తంజావూరు రాజ్యాధిపతి అయ్యాడు. ఈ విషయమంతా చరిత్రకారులు సాహిత్యవిమర్శకులు ఒకవిధంగా గుర్తించినా ఏకోజీ తంజావూరు పరిపాలకుడవ్వడానికి కారణంయేమిటి ? అసలు మహారాష్ట్రుడనబడుతున్న ఏకోజీ తంజావూరు రాజెలాఅయ్యాడు ? ఆప్రాంతాల కతనేవిధంగా వచ్చాడన్న విషయాలను సాకల్యంగా గుర్తించలేదు. ఏకోజీకి ఛత్రపతిశివాజీకి తండ్రిఅయిన శాహాజీ దక్షిణాదిని స్థిరపడ్డాడని గుర్తించినా నాయకరాజ్యం అంతమవ్వడం మహారాష్ట్రరాజుల పరిపాలన ప్రారంభమవ్వడంలో ఉన్నపరిస్థితులను సాకల్యంగా సమన్వయపూర్వకంగా విమర్శకులెవరూ వెల్లడించలేదు. ఈ సమన్వయం జరుగనందువల్లనే నాయకరాజులఅనంతరం—వారి సాహిత్యపరిపోషణను మహారాష్ట్ర రాజులు ప్రోత్సహించి ఏకోజీపుత్రులైన శాహాజీప్రభృతులు కొనసాగించినట్లు కొందరు భావించడంజరిగింది. ఆంధ్రదేశంవచ్చి ఆంధ్రరాజులతో సమానంగా తులతూగుతూ వారివలెనే అమూల్యసాహిత్యకళాపరిపోషణకావించిన శాహాజీ ప్రభృతుల వంశం లభ్యమైనంతలో యిది — పిరిది భోసలవంశం — యీ భోసలవంశంలో




* రాజుల పేరుల క్రింద ఉన్న సంవత్సరాలు వారివారి పరిపాలన (క్రీ. శ.) సంవత్సరాలు. 1773-1776 మధ్యకాలంలో ముస్లిం పరిపాలకుల సామంతులుగా తుళుజరాజులున్నట్లు కనిపిస్తున్నది. తుళుజరాజు తరువాత అమరసింహుడు కొంత కాలం పరిపాలించాడు.

బాబాజీ—మాలోజీలకు ఆంధ్రదేశంతో సంబంధంలేదు—ఛత్రపతిశివాజీ తండ్రి అయిన శాహజీ కర్ణాటకరాజ్యంపేరుతోఉన్న దక్షిణాంధ్రప్రాంతానికి తొట్ట తొలుత తరలివచ్చాడు. బిజాపురంరాజైన మహమ్మద్ ఆదిల్ శాహజీకి నైజాం శాహిలోని జాగీరులిచ్చి తన దండనాయకులలో ఒకడుగా నియమించాడు. అనంతరం శాహజీ ఆదిల్ ఆజ్ఞానుసారం కర్ణాటక విజయయాత్ర సాగించాడు. తత్ఫలితంగా శాహజీకి కర్ణాటకంలోఉన్న అప్పటి ఆంధ్రభాషాప్రాంతాలైన కోలారు-బంగలూరు - బారాకోట - బాలాపూరు - శిరకటప్రాంతాలు జాగీర్లుగా లభించాయి. శాహజీ తన తొలిభార్యకు తొలిపుత్రుడైన సంభాజీని తన చిన్న భార్యఅయిన తుక్కాబాయిని తీసుకుని క్రీ. శ. 1636 నాటికే కర్ణాటకంలోని తన జాగీర్లుచూచుకుంటూనే తంజావూరురాజ్యాన్ని ఆక్రమించాలన్నదృష్టితో కర్ణాటకానికి తరలివెళ్లిపోవడంజరిగింది. శివాజీతండ్రియైన యీ శాహజీయే విజయరాఘవుని ఓడించి తంజావూరురాజ్యాన్ని స్వాధీనపరచుకున్నట్లు కీ. శే. శ్రీ కె.వి. లక్ష్మణరావువంటివారు అభిప్రాయపడగా "విజయరాఘవభూపాలుడూ అతని కొడుకైన మన్నారుదేవుడూ కూడా మధురప్రభువైన చొక్కనాథనరనాయ కునితో యుద్ధంలో దండనాయకుడైన వెంకటకృష్ణప్పచేత క్రీ. శ. 1673లో హతమార్చబడి"నట్లు కొందరు చరిత్రకారులు భావించారు. అలగిరిపరిపాలనాకాలంలో అతనిమంత్రియైన వెంకన్నతో విరోధంరావడంవల్ల ఆ వెంకన్న విజయరాఘవుని కుమారుడనిచెప్పి ఒక కుర్రవానిసడ్డంపెట్టి తంజావూరురాజ్యం అతనికిరావాలనిచెప్పి అలగిరిపరిపాలననుంచి తంజావూరును తప్పించాలని ప్రయత్నించాడు. ఈ తంత్రాంగంలో బిజాపూరసుల్తాన్ సహాయసంపత్తి నతడర్థించాడు. బిజాపూరరాజు దండనాయకుడుగానేకాక జాగీర్దారుగాకూడా తంజావూరు ప్రాంతాలలోనేఉన్న శాహజీపాత్ర యీ సందర్భంలో చాలా ఉన్నదనే చెప్పవచ్చు-శాహజీ ఒక అసాధరణమైనపాత్ర వహించబట్టే అలగిరి అనంతరం తంజావూరురాజ్యం తన కుమారుడైన ఏకోజీకి దక్కించుకోగలిగాడు. శాహజీ తనరాజ్యాన్ని విస్తృత పరచడానికి అనేక యుద్ధాలుచేశాడు. క్రీ. శ. 1656 ప్రాంతంలో జరిగిన కనకగిరి యుద్ధసమయంలో అఫజల్ ఖాన్ మోసంవల్ల శాహజీ తన ప్రియతమజ్యేష్ఠపుత్రుడైన సంభోజీని (శివాజీఅన్న) కోల్పోయాడుగదా !—

శాహజీ తన పెద్దకొడుకైన సంభోజీతోను రెండవభార్యఅయిన తుక్కాబాయితోనూ కర్ణాటకానికి తరలివచ్చాడని అది క్రీ. శ. 1636 కు పూర్వమే జరిగిందనికూడా గుర్తించాము. శాహజీ రెండవవివాహంచేసుకున్నది క్రీ. శ. 1630లో, అయితే శాహజీ కోలారుప్రాంతాలకు తరలివచ్చేసరికి (1635-36 ప్రాంతం) తుక్కాబాయికి సంతానంకలగలేదన్నది స్పష్టం-కాగా శాహజీ తుక్కాబాయిలకు ఏకోజీ పుట్టింది పెరిగింది నాటి ఆంధ్ర కర్ణాటకంలోనే-తొలినుంచీ ఏకోజీని తంజావూరుకు రాజునుచెయ్యాలన్నతలంపు శాహజీకి ఉన్నది- అందువల్లనే మహారాష్ట్రంలో తనకున్న జాగీర్లవిషయమంతా శివాజీకి (పెద్దభార్యకొడుకు) అప్పగించాడు. కాగా ప్రజాభిమానం సంపాదించడానికి తానై తెలుగు సంస్కృతాది కవిపండితులను ఆదరించడం తనకున్నంతలోనే అమూల్యమైన ప్రాచీన వ్రాతప్రతులు కాపీలువ్రాయించడంవంటి పనులు చెయ్యడమేకాక తన కుమారునికి

తెలుగు మాతృభాషవంటిదిగానే నేర్పించాడు. అయినా యీ ఏకోజీని మహారాష్ట్రుడుగానే భావించవచ్చు.

శాహజీవంశీకులు తమ సంతానానికి తమ పూర్వులపేర్లే తరచుగా పెట్టుకున్నట్లు కనిపిస్తున్నది. వివాహమైనతరువాత తమ యింటికోడలికి తమ యిష్టంవచ్చినపేరు పెట్టుకునే సాంప్రదాయం మహారాష్ట్రులలోకూడా కొందరిలో ఉన్నది. ఈ సాంప్రదాయంప్రకారం శాహజీ తనకోడలైన ఏకోజీభార్యకు దీపాంబిక అన్నపేరు-తన తల్లియైన దీపాబాయి పేరును దృష్టిలోపెట్టుకొని-పెట్టినట్లు కన్పిస్తున్నది. శాహజీ తనకుమారుడైన ఏకోజీకికూడా తనమేనమామఅయిన (దీపాబాయిఅన్న) వెంకోజీపేరుపెట్టాడు. ఏకోజీకి వెంకోజీ అని ఉపనామంకూడా ఉన్నది. ఏకోజీకూడా తన పెద్దకొడుక్కి తన తండ్రి శాహజీపేరు-రెండవ కొడుకుకు-తనపినతండ్రిఅయిన శరభోజీ (దీనికిమూలం శరఫ్‌జీ) పేరు-మూడవ కొడుకుకు తనతల్లి పేరు వచ్చేట్లు తుక్కోజీ అని పేరుపెట్టుకున్నాడు—

ఏకోజీ క్రీ.శ. 1676నుంచి క్రీ.శ.1683 వరకూ తంజావూరును పరిపాలించాడు. ఇతని అనారోగ్యకారణంచేతనో మరే కారణంచేతనో క్రీ. శ. 1684 నుంచి ఏకోజీ పెద్దకొడుకు శాహజీ రాజ్యానికివచ్చాడు. ఏకోజీ రాజ్యభారంవహించేసరికి దాదాపు 30 సంవత్సరాలవాడైవుంటాడు. దాదాపు ఎనిమిదిసంవత్సరాలు పాలించి ఆ భారాన్ని పెద్దకొడుకుపై వుంచాడు. అయితే యీ ఏకోజీభార్య మహారాష్ట్ర స్త్రీగా కనపడడంలేదు. "తులు"జాతి స్త్రీయేమోననిపిస్తున్నది. ఏకోజీ తండ్రి అయిన మొదటిశాహజీ క్రీ. శ. 1636లో కర్ణాటకంలో స్థిరపడ్డతరువాత తంజావూరుపతనం జరిగేవరకూ మిన్నకుండలేదు- చిన్న చిన్న ప్రదేశాలను జాగీర్లను ఆక్రమిస్తూ తన స్వాధీనంలోకి తెచ్చుకుంటూనేఉన్నాడు. అప్పుడు శాహజీ "చంద్రగిరి-కళ్యాణపురి" నదులనడుమఉన్న "తుళు"* ప్రాంతాన్ని స్వాధీనపరచుకున్నట్లు కన్పిస్తున్నది. ఈ నదులమధ్య "తుళు" భాషాప్రజలు నివసిస్తారు. అత్యంత సుందరతర అయిన తులుయువతిని ఏకోజీ వలచి వివాహం చేసుకున్నడా అని అనిపిస్తున్నది. ఎవరినివివాహంచేసుకున్నా "దీపాంబిక" అని పేరు పెట్టుకొనడంలో యిబ్బందివుండదు- తొలి ఏకోజీకి 3-4 తరాల తరువాత పుట్టిన తులుజ (ప్రతాపసింహునికొడుకు) రాజు మొదలుగా తులుజవంశం యేర్పడినట్లు కొందరు చరిత్రకారు లవోహపడ్డారు. (రెండవ ఏకోజీకుమారుడైన తుక్కోజీకి తులుజనామం ఉన్నదని అతనివద్దనుంచే తులుజరాజులనబడ్డారనికూడా కొందరు భావించారు.) కాని తులుజశబ్దం తొలిఏకోజీ మూడవకొడుకైన తుక్కోజీకి నామాంతరంగా వాడబడింది. అంతేకాదు. ఏకోజీపిగ్గరనుంచి రాజులందరికీకూడా, తులుజ రాజేంద్ర "తులుజభూపాల!" వంటి పదాలరూపంగా సామాన్యంగా ప్రయోగించబడింది. ప్రస్తుత శృంగారపదాలలో శాహజీ-శరభోజీ-తులుజులకేకాక ఏకోజీకి కూడా తులుజశబ్దం పెక్కు సందర్భాలలో ప్రయోగింపబడింది. అయితే ఏకోజీ

---

*ద్రావిడ భాషల్లో "తుళు" భాష ఒకటి- ఆంధ్ర భాష- ఆంధ్రజాతివలెనే-తుళు భాష-తుళు జాతి ఉన్నది- 1941 జనాభా లెక్కల ప్రకారం తుళు భాష మాట్లాడేవారు మన భారతదేశంలో 9,138,000 మంది వున్నారు.

తుళుప్రాంతాక్రమణ తరువాత ఆ తుళుప్రాంతంలో నేపుట్టాడా అందువల్ల తుళుజశబ్దం ఏకోజీకి ఉపయోగింపబడిందా అని అనిపిస్తున్నది. తుళుప్రాంతాన్ని పరిపాలించేవారు తుళుదేశంలో పుట్టినవారూ-తుళుజాతిస్త్రీకి పుట్టినవారూ తులుజులవుతారు.

పెక్కు తెలుగుకృతులలో అనేకసందర్భాలలో "తుళుజ"శబ్దమే ఉపయోగింప బడింది-కాని కొందరు చారిత్రకులు "తులజ"గా ఉపయోగించారు. ఇది చర్చాపూర్వకంగా జరుగలేదు. భోసలవంశీయులు తుల్జాభవానీభక్తులైనందున తులజులైనారని కొందరభిప్రాయపడవచ్చు. కాని శాహజీవంశీయులు ఏకోజీ ప్రభృతులు అంతా తుల్జాభవానీభక్తులుగా కనిపించడంలేదు. పైగా అపరసాంబ శివులుగా వర్ణించబడినవారూ ఉన్నారు-మన్నారుదేవునిభక్తులూ ఉన్నారు. నిర్వివాదంగా అందరికీ వాడబడిన తులుజశబ్దం తుల్జాపరమైనదికాదని చెప్పవచ్చు. కావ్యాలలోని "లు" కారమధ్యమత్వం "ల" కారమధ్యమత్వానికి పూర్తిగా భిన్నమైనది. అంతేకాదు "తుళుజమహీనాథ" "తుళుజావనీంద్ర"వంటి పదాలు "తుళుదేశీయుల ప్రభువు" అన్న అర్థాన్ని నిస్సందేహంగా ప్రతిపాదిస్తాయి.

ఇక్కడ మనం గుర్తించవలసిన విషయం ఒక్కటున్నది. శాహజీ—శరభోజీ—తుళుజ (తుక్కోజీ)లు ముగ్గురూ ఏకోజీపుత్రులే. వారు అన్నదమ్ములే-కాని దీపాంబికా సుతాదిశబ్దాలు శాహజీ-తులుజ (తుక్కోజీ) రాజులకు మాత్రమే అనేక సందర్భాలలో ఉపయోగింపబడింది. శరభోజీనీ దీపాంబికా సుతుడుగా నివర్తి శేషాచలకవి పేర్కొన్నా యితరత్రా అందుకు భిన్నత్వం కనిపిస్తున్నది. కాగా ఏకోజీకి కూడా రెండు వివాహాలైనాయా శాహజీ—తులు రాజులు ఒక తల్లి బిడ్డలు కాగా శరభోజీ మరొకతల్లి సంతానమా అన్న సందేహం కలుగుతున్నది. ఈ శరభోజీకి ఏకోజీ నానుకున్నైన కొడుకున్నట్లు ప్రస్తుత పద్యగ్రంథంలోని తొలిపద్యంలో ఉన్న శరభేంద్రతనయుండైన ఏకోజీవరవినుత అని తులుజ భూపాలుని పేర్కొనడం వల్ల స్పష్టపడుతున్నది.

నాయక రాజుల కాలంలో తంజావూరు-మధుర ప్రాంతాలన్నీ బహుముఖమైన ఆంధ్రకళామతల్లికి సారస్వతజ్యోతికి ఆలవాలమయ్యాయి. అందువల్ల తొలి శాహజీ తన పుత్ర పౌత్రులందరికీ ఉగ్గుపాలతోనే తెలుగుతోపాటు యితర భాషలుకూడా వారికి నేర్పించి కవితా పాండితీ ప్రతిభలలవడేట్లు చేశాడు. అందువల్లనే ఏకోజీ కొడుకైన శాహజీ నాయకరాజులను మరపించేట్లుగా సాహిత్యసృష్టి పరిపోషణ చెయ్యగలిగాడు. జన్మతః తెలుగు నేర్చుకొని తెలుగు ప్రజలమధ్య పెరిగి సేవచేసిన శాహజీ ప్రభృతులను (వారి పూర్వులు మహారాష్ట్రులైనా) మనం ఆంధ్రులుగా భావించడంలో అవాస్తవికతకు తావులేదు. తొలి ఏకోజీ మొదలు శివాజీ వరకూ ఆ భోసలవంశీయులందరూ ఉగ్గుబాలతో తెలుగు నేర్చుకున్నవారే-

తొలి శాహజీ తుక్కాబాయీల వంశంలో మొత్తం శాహజీలు యిద్దరు- ఏకోజీలు ముగ్గురు — శరభోజీలిద్దరు — తుక్కోజీలిద్దరు — ప్రతాపసింహుడొక్కడు — ప్రత్యేకించి "తుళుజ"నామం (ప్రతాపసింహుని కుమారునికి తుక్కోజీఅనికాక "తుళుజ"నామంమాత్రమే ఉన్నట్లు కనిపిస్తున్నది.) వున్న రాజొక్కడు—శివాజీ (ఛత్రపతిశివాజీ జిజాబాయికొడుకుగదా!) ఒక్కడుఉన్నట్లు స్పష్టపడుతున్నది. కొన్ని

కావ్యాలలో శాహజీవంశానికి సంబంధించిన పద్యాలలో కొన్ని కొన్ని పాదాలువిలుప్తాలైపోవడంవల్ల చారిత్రకులు పురుషక్రమాన్ని సరిగ్గా గుర్తించినట్లు కనపడదు. తంజావూరును పాలించిన శాహజీవంశీయులలో చిట్టచివరివాడైన శివాజీ "అన్నపూర్ణాపరిణయము" అన్న కావ్యాన్ని రచించాడు. ఇతని పరిపాలనాకాలం క్రీ. శ. 1833–1855 మధ్య- ఈ కావ్యంలో శాహజీ పుత్రపౌత్రులనందరినీ పేర్కొనలేదు. తంజావూరు రాజ్యపాలనకు వచ్చినవారిని కొందరిని పేర్కొన్నాడు.

ద్విపద. శ్రీ శాహజేంద్రుండు చిరసద్గుణుండు–వాసిగాను వెలింగెవైపుమీరగను
నేకోజి యనుపుత్రునెలమిగానపుడు–జోకతోఁగాంచెను సొంపుమీరగను
శ్రీమించి యేకోజి చెలువుచెందగను–ప్రేమగా యీ చోళభూమిపాలించి
తుక్కోజి యనుపుత్రుఁదుల్యునిఁగనియె–చక్కనౌసౌందర్యశాలి తుక్కోజి
చెలువుఁడైన ప్రతాపసింహేంద్రుఁగాంచె – నిలలోన జనులెల్ల
హెచ్చుగాఁబొగడ

వ. ఇవ్విధఁబునఁబ్రతాపసింహేంద్రుండు పూర్వరాజర్షులంబోలి రాజ్యంబు
చేయుచునుండి తులజేంద్రుండను కుమారునింగాంచె నివ్విధంబుగా–

ద్విపద. ఆ తులజేంద్రుండద్భుతగుణుఁడు–ఖ్యాతుడై విలసిల్లి ఘనులఁబోషించి
బహుయోగశాలియై భాగ్యసంపదలు–సహజముగాగాంచి సౌందర్యఘనుని
శరభేంద్రుఁడను పుత్రుఁజెలువుగాఁగాంచి – పరిపూర్ణ సామ్రాజ్య
పదమునసుంచె

ఆ శరభేంద్రుండు నతిసుందరుండు–శ్రీశివభక్తుండు స్థిరయశోధనుఁడు
మహాదేవుసత్కృపామహిమంబువలన–వహిమించిన శివాజీవర్యునిఁగాంచె
[అన్నపూర్ణాపరిణయము M. 662......G - 1225]

ఇందులో తొలిశాహజీని అతనికొడుకు ఏకోజీని అతని మూడవకుమారుడు తుక్కోజీని పేర్కొన్నాడు – ప్రతాపసింహుడు తొలి తుక్కోజీకొడుకుకాదు – రెండవతుక్కోజీకొడుకు – తొలి తుక్కోజీకొడుకు ఏకోజీ–ఇతడు కవి–ఈ ఏకోజీ కొడుకు తుక్కోజీ–ఈ తుక్కోజీకి ప్రతాపసింహుడు పుట్టాడు. "చెలువుడైన ప్రతాపసింహేంద్రుఁగాంచె" అన్నపాదానికి పూర్వం మరిరెండు ద్విపదలుండాలి–

"ఈడితఃవివర్యునేకోజిఁగనియె–వాడని నతుఁడు వసధీశవరుఁడు
తుక్కోజికలిగెను తుఁతూగునట్లు–నెక్కుడౌవిద్దెల నెసఁగు తుక్కోజి"

అన్న పద్ధతిలోఉంటే సరిపోతుంది–మధ్యలో ద్విపదలుపోయినవని గుర్తించక కొందరు ప్రతాపసింహుని తొలి శాహరాజుకు మునిమనుమడుగా పేర్కొన్నారు. ఇది సరికాదు– ప్రతాపసింహుడు కవియై పెక్కుగ్రంథాలు రచించిన రెండవ శాహరాజు చిన్నతమ్ముడైన తుక్కోజీకి మునిమనుమడు–మొదటి తుక్కోజీ కొడుకైన ఏకోజీ కవి అని యింతకుపూర్వం పేర్కొన్నాను. ఇతడు (ప్రతాపసింహునితాత) రామాయణము రచించాడు. (M-16 - G- 2525) అందులో

భోసలకలశాబ్ధి పూర్ణచంద్రుండు–భాసుర మాళోజి పార్థివ సుతుడు
సాహసాంకుడు నిత్యసత్యసంధుండు–శాహాభూపాలుండుచతురమానసుడు

అతనితనూజుఁడేకావనీపాలు-డతనిబాలకుఁడు శాహజీతీపాలు
డతని సోదరుఁడుమహాకీర్తిశాలి-చతురుడు శరభరాజస్వర్గదేవేంద్రు
డా రాజసోదరుండతులవిక్రమునుం-ధీరుండునయశాలి దీపాంబసుతుడు
చోళభూపాలుండు సుగుణహారుడు-పాలితసుజనుడు పరమపావనుడు
పనువడితుళుజభూపాలుడా రాజ——— .... దేకధరణిపాలకుఁడు

అంటూ శాహమహారాజు చిన్నతమ్ముడైన తుళుజ (తుక్కోజీ) భూపాలుని కుమారుడు ఏకోజీ (ఇతడే రామాయణకర్త) అని ఉన్నగురించి పేర్కొన్నాడు. కాబట్టి అన్నపూర్ణాపరిణయంలోని ద్విపదలలోలోపం ఉన్నదనుట తప్పదు. రామాయణకర్త అయిన యీ ఏకోజీ క్రి. శ. 1737లో ఒక్కసంవత్సరం మాత్రం రాజ్యం చేసినట్లు కన్పిస్తున్నది-ఇతడు ద్విపదరామాయణం—విఘ్నేశ్వరకల్యాణ నాటకం—కొన్ని నీతిపద్యాలు రచించాడు. ఈ ఏకోజీకి బాబాసాహెబ్ అని నామాంతరంకూడా ఉన్నది.

ఏదియేమైనా నాయకరాజులఅనంతరం శాహజీ ధర్మమాఅని మహారాష్ట్రుల పరిపాలన యేర్పడినా తెలుగు సంస్కృతాది కళాసరస్వతులు అపురూపకాంతి పుంజాలను వెదజల్లాయి. తొలిశాహజీ సూత్రధారిత్వంలో ఏకోజీ రాజైనా విజయరాఘవునిఅనంతరం ఒక దశాబ్దంపాటు అంటే రెండవశాహజీ రాజ్య పరిపాలనకు వచ్చేవరకూ (క్రి. శ. 1684) ఆంధ్రసాహిత్యానికి సరైన ప్రోత్సాహం లభించినట్లు కనపడదు. రెండవశాహజీ తానై సవ్యసాచిగా పలురచనలు చెయ్యడమే కాక అనేకమంది కవిపండిత కళాకారులను పోషించి తోషింపజేశాడు. తొలిశాహజీ తరువాత ఏకోజీ ప్రభృతులు తంజావూరు పరిపాలించినా మధురచొక్కనాథ భూపాలాదులకు సామంతులుగా ఉన్నట్లు కన్పిస్తున్నది. పెక్కు పాటలలోని చొక్కనాథపాలా వంటి విశేషణాలు యీ విషయాన్ని ధ్రువపరుస్తున్నాయి.

"కోపము సేయకె" అన్నపదంలో (15 పుట) తులజేంద్రుడు సూర్య వంశజుడుగా పేర్కొనబడ్డాడు. కాగా శాహజీది సూర్యవంశమన్నమాట. శాహజీ ప్రభృతులందరూ మదనమోహనసౌందర్యవంతులు — ధీర వీర పరాక్రమవంతులు— శరణాగతరక్షకులు—సంగీతసాహిత్య కళాసంసేవకులు—ఆశ్రితజనపోషకులు వినయ సంపన్నులు-మాతాపితృభక్తికలవారు-సోదరప్రేమసమన్వితులు-దైవభక్తితత్పరులు- శృంగారప్రియులైకూడా పాపభీతికలవారు. వనితాలోలురైనా నీతి నిజాయితీలు కలవారు-ఈ గుణగణాలన్నీ శాహజీప్రభృతులలో వున్నాయని యీ పాటలలో గోచరమవుతుంది. అయితే శాహజీ శ్రీరాముని వంటివాడుగానైతం కొన్ని కృతులలో వర్ణింపబడడం మనం గుర్తించవలసిన ముఖ్యవిషయం-శాహజీ, శరభోజీ, తుళుజ (తుక్కోజీ) ఏకోజీలను (ఇతడు శాహజీతండ్రికావచ్చును లేదా శరభోజీ కొడుకూ కావచ్చును. తుక్కోజీకొడుకైనా కావచ్చును.) దృష్టిలోపెట్టుకొని యీ శృంగారపదాలు అజ్ఞాతకవితల్లజునిచేత రచియింపబడ్డాయి. ఏకేంద్రసుత— ఏకేంద్రవినుత వంటి విశేషణాలు పెక్కుపాటలలో కనిపిస్తాయి. ఏకేంద్రసుత అంటే తొలి ఏకోజీ కొడుకు అన్నది విస్పష్టం. "ఏకోజీవినుత" వంటివాటికి—కొన్ని సందర్భాలలో తండ్రిచేత నుతింపబడినవాడు-అని ఆయా పదాల్లో శాహజీప్రభృతి సోదరు లెవరు వర్ణింపబడితే వారికి సమన్వయమవుతుంది. తుళుజేంద్ర (తుక్కోజీ)

పదాలలో "పెదతండ్రి (శరభోజీ) కుమారుడైన ఏకోజీచేత నుతింపబడినవాడు" అనికూడా అర్థంరావచ్చు–

అత్యంతవిపులమై పరిశోధనాత్మకమైన యీ పీఠికలో పదవాఙ్మయమంటే యేమిటో లోతుగాపరిశీలించి అపూర్వ సంగీతసాహిత్య శాస్త్రవిశేషాలు వెల్లడించడంజరిగింది– దక్షిణాంధ్రాన్ని పరిపాలించిన భోసలవంశీయులచరిత్ర విషయంలోకూడా అనేక నూతనవిషయాలు ఉల్లేఖించాను. ఈ పీఠికతో ఆంధ్రవాఙ్మయ వ్యవస్థాసమన్వయంలో–సమన్వయరహితంగా దారితప్పి నడచిన–పరిశోధనావిమర్శలు–సమన్వయ పురస్సరంగా సక్రమమైన రాజవీధిలో నిరాటంకంగా పయనిస్తాయని నిస్సందేహంగా చెప్పవచ్చు–

ఏనాడో రచియించబడి మరుగునపడివున్న యీ శృంగారపదాలను శ్రమపడి సంపాదించి యీరూపంలో ఆవిష్కృతమయ్యేట్లు రూపొందించినవారు శ్రీ పి. సీతాపతి (ఫార్మర్ డైరక్టర్ స్టేట్ ఆర్కైవ్స్) శ్రీ కె. వెంకటేశ్వరరావుగార్లు. శ్రీసీతాపతిగారు డైరక్టరుగాను శ్రీ ఆర్. విశ్వనాథరావుగారు అసిస్టెంట్ డైరక్టర్ గాను ఉన్నప్పుడు ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మానిస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రిసర్చిఇనిస్టిట్యూట్ పక్షాన ప్రచురించాలని నిర్ణయించి ప్రభుత్వఅనుమతి పొందిన ప్రాచీనగ్రంథాలలో యీ శృంగారపదాలు ఒకటి. దీనిని తంజావూరు సరస్వతీమహలులోని తాళపత్రప్రతుల మైక్రోఫిల్ములనుండి ఓపికగా కాపీవ్రాసిన శ్రీ M. మునిరత్నంను, శ్రీ E. హనుమచ్ఛాస్త్రిని (అసిస్టెంట్ ఆర్కైవిస్ట్స్–స్టేట్ ఆర్కైవ్స్) అభినందిస్తున్నాను–

అమూల్యప్రాచీనగ్రంథాల ప్రచురణకై మన సంస్కృతీసంపదల పునరుద్ధరణకై అత్యంత శ్రద్ధాభక్తులతో అభిలాషాసక్తి చూపిస్తూ సారథ్యంవహిస్తున్న ఆంధ్రప్రదేశప్రభుత్వ ముఖ్యమంత్రి గౌరవనీయులైన శ్రీ పి. వి. నరసింహారావు గారికి–విద్యాశాఖకార్యదర్శి శ్రీ యస్. ఆర్. రామమూర్తి (I. A. S.) గారికి ఉపకార్యదర్శి శ్రీ డి. కామయ్య సహాయకార్యదర్శి శ్రీ వి. రఘునాథరావు గార్లకు మా కృతజ్ఞతలు. ప్రభుత్వం ప్రచురిస్తున్న యీ గ్రంథాలను ఓర్మితో శ్రద్ధతో సుందరతరంగా ముద్రిస్తున్న ఆంధ్రప్రదేశ టెక్స్ట్ బుక్ ప్రెస్ డైరక్టర్ శ్రీ నారాయణరావుగారికి–అడుగడుగునా సహకరించి తోడ్పడుతున్న డిప్యూటీ డైరక్టర్ శ్రీ జి. రామకృష్ణారావుగారికి తదితరఉద్యోగులకు మా హృదయపూర్వక అభినందనలు.

ఇట్లు
వాఙ్మయ మహోధ్యక్ష
వడ్లమూడి గోపాలకృష్ణయ్య
కళా-ప్రపూర్ణ
JOINT - DIRECTOR
Andhra Pradesh Government
Oriental Manuscripts Library &
RESEARCH INSTITUTE.

పరీధావి, తెలుగుఉగాది.
16–3–1972
హైదరాబాదు.

# శృంగారపదములు

## (పాటలు – పద్యములు)

## ప్రాచీన అజ్ఞాతకవికృతము

# శృంగారపదములు

## భైరవిరాగం — ఆదితాళం

కన్నుల పండుగాయెరా
నిన్ను జూడగా
కన్నుల పండుగాయెరా
ఘనుడ ! శ్రీతుళజభూపా

చిన్నెలన్నియుంజూచి
చాలా మోహించి
యున్నాను కరుణించుమీ
సన్నుతకీర్తి విశాలా!
సద్గుణశుభలీల,
వన్నెకాడ ! నీచిన్ని వనిత మరులుకొని ॥౧॥

సామిగాౘమొక్కెనురా , ఈ వేళ నీవు
తామసము సేయకురా , నా ముద్దు
సామిగా, నీ ముద్దు సొగసుచూచి ॥౨॥

శరభేంద్రతనయుండైన ఏకోజి
వర వినుత, భోసలేంద్ర !
సరస జనపాలక !, సామితుళజభూపాల !
సరసమైనట్టి, చక్కదనముచూచి ॥౩॥

వలచినాను, వలపు చాల నిలుపఁజాల
వలరాజు బారికితాళ, తుళజమహిపాల
విరహము తాళఁజాల, సరసుండా కోపమేల
విరిబోణిబోధనలు , వినవేల భూపాల ! ॥౪॥

నిన్నె నమ్మినదాన నీ పొత్తు నేను మాన,
వన్నెకాడా ! చిన్నదాన, వలచి వచ్చినదాన
సరసయేకేంద్రనుత, సామిశ్రీతుళజేంద్ర
గుఱుతుగా రతికేలి, కూడుము భోసలేంద్రా ॥౫॥

... ... ... ...

కల్యాణి — ఆది

పరమమౌ తంజపూరి, కోటలో మంచి
సరసుడైన తుళజ జనపాలుండు
సరస చోళ భూమిపాలుడు
వెలయు సకలదేవ పుణ్యపాలుండు ॥౧॥
ఘనమైన కీర్తి విశాలుంతు, వాడు
ఘనుడు, దీపాంబికా తనయుండు
ఘనమైన శివభక్తిశీలుండు, సామి
ఘనుడు, రాజులమేటిధీరుండు ॥౨॥
చతురుడే ఏకేంద్ర వినుతుడు, సామి
చంద్రమౌళీశ్వరభక్తుండు
సద్గుణశుభలీలుండు, వాఁడు
జనపాల తుళజరాజన్య దేవేంద్రుండు ॥౩॥

వసంతభైరవి — ఆది

చెలియరో చూడవె, నేటి ముచ్చటలెల్ల
చెలికాడైన తుళజ రాజేంద్రుండు కరుణించెనె
చెక్కిలి నొక్కిలి నొక్కమంటి, చిన్నెలు జేసివాడు
చెక్కెరమోవియాని చేక్కగ కౌగిలించెనె ॥౧॥
చెలిచే నేవిభుని, పిలువ నంపగానె
చెలగి మాటాడుచు, చెలికాడు వచ్చె కొమ్మ!
చేక్కని యేకేంద్రనుతుడు, జనపాలతుళజేంద్రుండు
గ్రక్కున రతికేళిని, కలసి సంతసిల్లెనమ్మా! ॥౨॥

కాఫీ — అట

నిన్ను నెఱనమ్మినదానరా నేను
నెఱజాణ! తుళజేంద్ర! భోగదేవేంద్ర! ॥౧॥
కన్నెలందఱు జూడ, కన్నడి సేతురా?
మన్నెహంవీర! మ్రొక్కెరా మదనావతార! ॥౨॥
మునుపటి మమతలు, మునుపటి నెనరులు
మనసున నుంచరా, నా మనవిచేకోర ॥౩॥
దిన దినము నా మది, తెలియని వాని వలెనె
ఘనుడ! నలుగురు జూడగ, మోడిసేతురా? ॥౪॥

మధ్యమావతి — అట

సామి! రారా, నే నీకు మ్రొక్కెదరా
సామి! రారా భోసల శ్రీశరభోజరాజేంద్ర! ॥౧॥

వలచిన దాననురా, వలపు నిలుపలేరా
వలరాయుని బారికి, వశము కాదు తాళరా ॥౨॥
చిలుక పలుకులు, చెవులను వినలేరా
చెలువ గంధము బూసి, సామి ! కొనియున్నానురా ॥౩॥
ఎలమి నతనుడండైన, ఏకేంద్రవినుత !
చెలువుగా కూడుము శ్రీశరభోజేంద్రా! ॥౪॥

*వసంతతిలకం—ఆది*

వెలదిరో వినవమ్మా ! యీ వేళ
విరహము తాళనమ్మ !
ఎలమితో శరభేంద్రు
డెన్నటికి వచ్చునమ్మా !
సరసమైన గుబ్బలను, సరసమైనమోవిని
సరసమైన మోమునకు, సామి ముద్దు బెట్టునెపుడు ॥౧॥
ఘనమైన మాటలను, ఘనమైన పాటలను
ఘనమైన యాటలను, ఘనుడెన్నడు జూచునమ్మా ! ॥౨॥
సరసు డేకేంద్రసుత, శరభ భూపాలకుండు
సరసకేళిని నన్ను, జోడుగా గూడేదెపుడమ్మా ! ॥౩॥

*ఎరుకల కాంభోజి — ఆది*

అలుక చేసేది న్యాయమా ! చేక్కని సామి,
చెలికాడా నీకు మ్రొక్కేనురా
చిన్నదాన, కౌగిలీరా, ఆ వలరాజుబారితాళ
వన్నెకాడ ! కోపమేల,
సలలితగుణశీల, సామి తుళజమహిపాల ! ॥౧॥
విరహము తాళలేరా, వెన్నెలకాంతి కోర్వలేరా
సరసగంధము బూయరా, చేక్కెర కెమ్మోవియ్యరా ! ॥౨॥
సరస యేకేంద్రవినుత ! జనపాలతుళజేంద్ర!
సురతకేళిని నన్ను, జోడుగూడి పాలించరా ! ॥౩॥

*కల్యాణి — ఆది*

ఇది సమయమురా, దయజూడరా
సదయకీర్తి విశాలా !, శరభోజి భూపాలా !
చలమేల జేసేవు, స్వామి నా హృదయేశా !
పలుమాఱు నీ పదముల మ్రొక్కెదరా !
అలమికౌగిటఁ జేర్చి, అరుదైనకెమ్మోవి
పలుగంటిజేసి, గుబ్బలగోరు జీరను ॥౧॥

సరసములాడుచు, సంతోషముగాను,
సరసుడా నీవు నన్ను, కరుణతోఁబిలిచి
విరివిగ కర్పూర, వీడెమిచ్చివేగ,
గరిమ ముచ్చటలాడి, గ్రక్కున నన్నాదరించి ॥౨॥
సరసయేకోజిరాజ ! సన్నుతశరభేంద్ర!
విరహము తాళలేరా, వేడ్కతో రారా
వరుసగంధము పూసి, వగకాడా ! యీ వేళ
సరసమదనకేళిజతగూడి పాలించుము ॥౩॥

మోహన-ఆది

నీ సొగసు జూచి, మోహించినాను
నీవు నన్ను కరుణించరా, భోసలకులచంద్ర !
శ్రీతుళజరాజేంద్ర ! భోగదేవేంద్ర మ్రొక్కెదరా ॥౧॥
శ్రీలక్ష్మివలె నేను ఉన్నానురా,
చెలువగా కరుణించరా !
చాల నీకు మ్రొక్కెదరా, చక్కెర కెమ్మోవిరా
లీలగా కౌగిలించరా, తాళజాలరా ॥౨॥
ఘనుడ ! ఏకేంద్రవినుత ! దీపాంబాతనయ !
జనపాలతుళజేంద్ర !
మనసిజ కేళిగూడి, మనసు రంజిల్లచేయరా
మనసున దయసేయరా ॥౩॥

... ... ... ...

శ్యామకల్యాణి — చంపు

నిన్ను నమ్మినదానరా, నా సామి
కన్నడ సేయకురా, ఘనుడ శ్రీభోసలేంద్ర
సన్నుతకీర్తిసాంద్ర ! సామిశ్రీతుళజేంద్ర !
వలచితి నేను చాల, వలపు దాచేవేల
వలరాజుబారి తాళ, వన్నెకాడ ! యీ వేళ ॥౧॥
రాజుల మేటివీవు, రాజచంద్రుడవీవు
రాజులలోన నీవు । రాజుకేసరి నీవు ॥౨॥
చతుర ! ఏకేంద్ర వినుత! చతుర శ్రీతుళజేంద్ర!
చతురత తోడుత, రతికేళి ననుగూడుమా ॥౩॥

బృందావని — ఆది

నిన్నె నమ్మినానురా, శ్రీతుళజేంద్రస్వామి!
భోసలకులచంద్ర, భోగదేవేంద్ర
భాసుర కీర్తిసాంద్ర!, భవ్యకరుణోపేంద్ర! ॥౧॥
నిన్ను జూచినపుడె, నిండు మోహముతోను
ఉన్నాను కరుణించు, మన్ననతో లాలించరా ॥౨॥
సరస యేకేంద్రవినుత, సామి శ్రీతుళజేంద్ర!
గరిమతో రతికేళి గారవించు మ్రొక్కెదరా ॥౩॥

సావేరి — ఆది

ఊరక కోపము జేసెనమ్మా!
ధీరుడు శాహరాజ దేవేంద్రుడు నా పై
చెక్కిలి నొక్కమంటి, చిన్నెలు సేయమంటి
ప్రక్కకు రమ్మంటి, బాగుగా కౌగిలిమ్మంటి ॥౧॥
వలచి నేనుండగా, వాఁడు నన్ను జూచి
పలుకులేదని సరి, పడతుల జూడంగ ॥౨॥
ధీరయేకేంద్రనుత గంభీరశాహేంద్రుండు
కూరిమి రతికేళిగూడి దాని మాట విని ॥౩॥

సావేరి—ఆది

మనసు సంతోషమాయెను, మగువరో! యిపుడు
ఘనుడైన శ్రీతుళజ జనపాలుని జూచి
ముద్దుమాటలాడి, ముద్దు పాట పాడి
ముద్దు సామి యిపుడు ముదితరో! లాలించగా ॥౧॥
వగలతోను వాఁడు, వంచన జేసి నన్ను
సొగసైన గుబ్బలను, సొంపుతో జీరంగ ॥౨॥
సరస యేకేంద్రనుతు సామి శ్రీతుళజేంద్రుడు
మరుకేళి గూడి నన్ను కరుణించెనప్పుడె ॥౩॥

సావేరి — ఆది

కోపమేలరా! చేక్కని సామి
కోపమేలరా! భూపాలతుళజేంద్ర!
వలచినాను బాల వలవలరాజు బారితాళ
వలపు నిలుపఁజాల, వన్నెకాడ! యీ వేళ ॥౧॥
కులుకు గుబ్బలపైని, నెలవంకలుంచరా
చెలువుడా! నాపై దయజేసి కౌగిలీరా! ॥౨॥

చక్కని యేకేంద్రవినుత, చక్కని శ్రీతుళజేంద్ర !
చక్కగ రతికేళి సామి నన్ను గూడరా ! ॥౩॥

సావేరి — ఆది

చక్కని వారిలో నీ సాటి
చక్కని దొరను గాన.
చక్కని యేకేంద్ర
సన్నుతతుళజేంద్ర
జనపాల రాజేంద్ర
సలలితగుణసాంద్ర
వలచి నేను చాల
యుండే వేళను
వగకాడ ! మాట
లాడితి వేర
చెలికాడా ! నీవు
చెలియలందఱుఁజూడ ॥౧॥
చక్కని కొనగోర నీవు
జేరితి వౌర
మోడి జేసి నేను ఉండే వేళను
మోము మోము జేర్చి
ముద్దు బెట్టి నీవు
వేడుకతోడను
పీడెము లిచ్చి ఏంతగా
చిన్నెలు జేసితి వౌర ॥౨॥
సరస నాక రాజ
సన్నుత వర
దీపాంబికా తనయ
శ్రీతుళజేంద్ర
సరసి జాక్షి చేర
రమ్మని పిలిచి
సురతకేళి జత
గూడితి వౌర ॥౩॥

గౌరి — చంపు

మ్రొక్కెదనీ పాదములకు
గ్రక్కున కరుణించరా
చెక్కని తుళజధీర
సామి కౌగిలించరా
నిన్ను నమ్మినానురా
నన్ను మన్నింపరా
వన్నెగా చిన్ని చెన్నుల
వగగా గోర జీరరా ॥౧॥

ఘన శివభక్తుండవు
ఘన యోగశాలివీవు
ఘన దీపాంబాతనయ
ఘన భోసల రాజేంద్ర ॥౨॥

సరస ఏకేంద్ర వినుత
సరస రసికుండ వీవు
సరసముగా రతికేళి
గరిమతోగూడి కరుణించరా ॥౩॥

... ... ... ...

గౌళిపంతు — ఆది

సామిగా నీ దానరా నేను
చెక్కని తుళజేంద్ర భోగదేవేంద్ర !
బాలరానిను బాసినేను
తాళరా, యీ వేళకురా
లీలగాను బిగికౌగిటజేర్చి
ఖాళిగా నను కరుణించుమీవేళ
వన్నెల చిన్నెల చెనుల
క్రొన్నెలలుంచు జవరాల ॥౧॥
తిన్నగాను పలుచని కెమ్మోవి
తేనియలను దయసేయుమీవేళ ॥౨॥
కంతుని కేళినను వింతగా కలిసితివిరా
సంతతమును, ఏకరాజవినుత
చెక్కని భోసలతుళజరాజేంద్ర ॥౩॥

*కావేరి — ఆది*

ఎంతటి వాడెనేడు బాల
యింత ముచ్చట జేసెనె
దీపాంబికాతనయుండు
దీన మందారుండు
భూపాల తుళజ రాజ
నృప దేవేంద్రుండు ॥౧॥
సరస యేకేంద్ర వినుతుండు
సరస సద్గుణశీలుండు
సరస సద్గుణశీలుండు
సరస చోళ భూపాలుండు, గంభీరుండు ॥౨॥
సకల సద్గుణ నిధి
సకల నిత్యోత్సవనిధి జనపాలనిధి ॥౩॥

*బిల్హరి — ఆది*

నిన్నె నమ్మిన దానరా నా సామిగా
నిన్నె
సన్నుత గుణశీల ! శరభోజ భూపాల
కన్నడ సేయకురా, మ్రొక్కెదరా
కరుణించి కౌగిలీయరా

చిన్ని చన్నులపైని క్రొన్నెలలుంచరా
చిన్నదాననెరా, చెంతకురారా ॥౧॥
కోరి వచ్చినదానరా, నాపై
కోపము సేయకురా
సారమైన కెమ్మోవి తేనియలీయరా
నా
సామిగా దయగా, మ్రొక్కెదరా ॥౨॥

రతికేళి జతగూడరా, యేక
రాజసుత ! శర భోజధీర, సం
తతకీర్తి విహార, శ్రుతజన మందార
సామి కరుణ జూడరా,
నే మ్రొక్కెదరా ॥౩॥

బిల్హరి — ఆది

నేనె కోపసత్యనని
నేరమెంచేవు
భూనాథ ! తుళజేంద్ర!
భూలోక దేవేంద్ర !
వగలను జేసినీవు
వట్టి యలుక జేసేవు
ఉవిదెల పాడి విని
ఊరక చేలక జేసేవు ॥౧॥
సన్నుతాంగులెల్ల గూడ
సైగజేసేరు నిన్ను
వన్నెకాడ ! నీవు నా
వద్దకు రారా ! వంచించేవు ॥౨॥
సరస యేకేంద్రవినుత !
సదయ ! శ్రీతుళజేంద్ర !
సురతకేళిని గూడి
గరిమ రంజిల్లసేయరా ॥౩॥

కన్నడ — ఆది

కన్నడ సేయకు మీ భామపై నీవు
వన్నెకాడ ! తుళజేంద్ర ! వలచినది మాబాల
కోరియున్నది చాలా, కోపము జేసేవేరా
సారెకు కీర్తివిశాల !, చాల మ్రొక్కెనీవేళ ॥౧॥
తిలకము దిద్దికొని, చెలియ శృంగారించుకొని
నెలకొని నీవె పతియని, నినునమ్మినది తరుణి ॥౨॥
ఏకేంద్రవినుత, భోసలేంద్ర తుళజరాజేంద్ర
జోకను రతికేళిని, జోడుగూడుమీవేళ ॥౩॥
వలచిన దానరా నేను నీపై చాల
సలలితగుణశీల, తుళజ మహీపాల !

బిల్హరి-ఆది

మ్రొక్కెనీ పదములకు
చక్కెర మోవియీరా
గ్రక్కున నాదరించు
ఘనుడ శ్రీ భోసలేంద్ర ॥౧॥

సరస యేకేంద్రవినుత ! సామి నా ప్రాణనాథా !
గరిమ మీఱంగనన్ను, కరుణించు మీవేళ ||౨||
ఏక రాజేంద్రతనయ ! లోకైకపాలక !
శ్రీకర తుళజరాజేంద్ర ! భోగదేవేంద్ర ! ||౩||

కన్నడ — ఆది

కోపమేలరా, చక్కని స్వామి
కోపమేలరా
భూపాలతుళజేంద్ర
భోగదేవేంద్ర! ||౧||
చెలిమిజేసి పిలిచిన
చెంతకు రాలేదా
తలచినపుడె సేవ
తానుచేయలేదా ||౨||
విలసిల్ల నేను నీ
విడిదికి రాలేదా
పలుమారు నీ మీది
పదములననేలేదా ||౩||
ఆ యింతి బోధనల
నన్నిటి నీవువిని
నాయందు దయలేక
నన్నలయించ ||౪||
న్యాయము కాదురా
నమ్మినదాన ; నన్ను
పాయక యీవేళ
బాగుకౌగి లియ్యరా ||౫||
వన్నెకాడా ! యేకేంద్ర
సన్నుత ! తుళజేంద్ర !
చిన్నదానను నీ
చిత్త మీయకున్నావు ||౬||
ఇది నీకు ఉచితము కాదురా !
మన్నించి యీవేళ
నన్నిపుడె యేలుకోరా !

ముఖారి — జంపె

వింటివా ! నీవు
కంటివా వానివగలు
ఓ చెలియరో !
జతగాడైన తుళజ రాజేంద్రుండు
సకియరొ ! ఎంత ముచ్చట జేసెనె
చక్కని గుబ్బల గోరుల గోరులుంచి
చక్కెర కెమ్మోవి యానిమించి
గ్రక్కుననన్ను కౌగిలించి
కలికిరొ ! యెంత లాలించెనమ్మా ! ॥౧॥
చనువులతో ముద్దుమాటలు విని
మనస్సు రంజిల్లనాతో సరసములాడి
వనజాక్షి రమ్మని చేరబిలిచి
వనితరొ ! కర్పూరవిడె మిచ్చెనమ్మా ॥౨॥
సరస యేకేంద్ర రాజవినుతుండు
జనపాల తుళజమహీపాలుండు
సురతకేళి నన్ను జోడుగూడి
తరుణిరొ ! నాపై దయ యుంచెనమ్మా ॥౩॥

ముఖారి — జంపె

తరుణిరొ ! నీ వగలు తెలిసి మోహించితి, నీ
సరసమైన తుళజ రాజన్యుండను నేను
ఘనమైన నీ కుచములను చూచి, వేడుకను
ఘనమైన నీ బుద్ధి గరిమ జూచి ॥౧॥
ఘనమైన నీ ముచ్చటను జూచి, రంజిల్లు
ఘనమైన నీ చక్కదనమును జూచి ॥౨॥
సరసమైనట్టి నీ, కరుణచే నా మనసు
నిరతమానందముగ, నీవు సేయవె
కరమునను సొగసు, కౌగిటను జేర్చియుండు
విరిబోడి ! కర్పూర విడెంబు లీయవే ॥౩॥

విలసిల్లు ఏకేంద్ర వినుతుండను, చతురుండను
తుళజేంద్రుండను, మమతతో చూడవె
చెలువైన రతికేళి కలిసి నా చిత్తమున
పలుమారు సంతోషముల కలుగజేయవే ॥౩॥

ముఖారి—ఆట

లీలగ శ్రీతుళజేంద్రుండు
లెస్సయుండిన చాలునే
వెలయు ప్రేమ నా మీద నెనరుంచి
వేడుక చెల్లించునె నా సామివాడు ॥౧॥
అలిగి నేనున్నఁజూచి, ఆదరించి, లాలించి
వెలదిరో! మాటలాడునె, నాప్రాణేశ్వరుండె ॥౨॥
వనజాక్షుల జూడంగ, వరుస సొమ్ములను
తన యింటికిచ్చి పనుచునె నా మేలు వాఁడె ॥౩॥
చతురు డేకేంద్రనుతుండు, చక్కని తుళజేంద్రుండు
మరురతికేళి నను గూడునె కొనియాడు ॥౪॥

ముఖారి — ఆట

ఎటువలె తాళుదునమ్మలారా
విటరాయుడైన తుళజ విభుని కరుణలేకయె
వగలు జేసివాడు, వట్టి అలుకజేసి
వగలాడిమాట విని
వద్దకు విభుండు రాకున్నాడు ॥౧॥
కలికి! వాని పాదములె గతియని యున్ననన్ను
కలకంఠిమాటవిని కన్నడ జేయుచున్నాడు ॥౨॥
మొన్నప్రొద్దునవచ్చి, కాముని కేళిగూడినన్ను
వన్నెకాడేకేంద్రవినుతుడు, వంచించెను తుళజేంద్రుడు ॥౩॥

సావేరి — ఆట

నీవలె చతురుండు, నేనెందుగానరా
భూవరతుళజేంద్ర! భోగదేవేంద్ర!
భావజరూప! భక్త కీర్తితభూప!
సరస యేకేంద్రనుత! జనపాలకులచంద్ర!
సరసరతికేళి సామి నన్నుగూడరా ॥౧॥

నిన్ను నమ్మి యున్నానురా
    నెనరుంచి కౌగిలీర
మన్యహంవీర ! నాతో
    మనసిచ్చి మాటాడరా ॥౨॥
వలచి వచ్చినానురా
    చలము జేసేదేమిర
సలలితగుణహార
    సామినీకు మ్రొక్కెదరా ॥౩॥

సౌరాష్ట్రం — ఆది

శ్రీరామావతారుడె
    శ్రీతుళజేంద్రుడె
వారిజబాంధవ
    వంశ వర్ధనుండు
తల్లిదండ్రి మాటలు
    తప్పని రాజ్యపాలుండె,
హితమైన భోసలేంద్రుండె హిమకిరణ గుణమహితుండె ॥౧॥
    సత్య భూషణ శీలుండె, సకలగుణ సంపన్నుండె
    నిత్య యశోభూషణుండె, నీతి తప్పనివాఁడె ॥౨॥
    దివ్యగుణ భూషణుడె దీపాంబికా తనయుండె,
    భూపాలతిలకుండె భోసలతుళజేంద్రుండె ॥౩॥

సౌరాష్ట్రం—ఆది

కాముండు మంచి వాడాయె
    కాంతుడు దయజేసినపుడె
సామి శ్రీ తుళజేంద్రుండె
    సరసములాడినపుడె
ఘనుడైన భోసలేంద్రుండు
    కౌగిట నన్నాదరించి
చేనుమొనలంటి నాపై
    నెనరుంచినపుడె ॥౧॥
సరసమై విడెమిచ్చి, చేందనము మేనబూసి
వరుసగా నాముద్దుమాట
    వగగాను విన్నప్పుడె ॥౨॥

సౌరాష్ట్రం — అట

కోపము సేయకురా
కోరియున్నానురా
శ్రీపతి కీర్తిసాంద్ర
శ్రీతుళజేంద్ర !
వలపు నిలుపలేరా
వలచినిను, ఉన్నానురా
చలము వలదురారా
సదయ ! నీకు మ్రొక్కెదరా ॥౧॥
ఆదరించి నన్ను బ్రోవుమీ
అలమి కౌగిలించుమీ
ముచ్చటతో కరుణించుమీ ॥౨॥
ధీరయేకేంద్ర వినుత దీపాంబికాతనయ
సారెకు మీవేళ చక్కని తుళజ భూపాల ॥౩॥

మోహన—అట

మనసు ఒకటిగానుంటే, యొనరు సకల కార్యములు
మనసు కలకము పుట్టితే, మాటికి కలహము పుట్టును
అన్నదమ్ములకైన, అత్యంతాప్తులకైన,
తిన్నగా స్త్రీపురుషులకైన,
తిరముగ తండ్రికొడుకులకైన, ॥౧॥
స్వామి సేవకులకైన, సద్గురు శిష్యులకైన,
వేమాఱు రాజమంత్రులకైన, వెలయు బావమఱదులకైన, ॥౨॥
తుళజేంద్ర యేకేంద్రులకైన, తురంగస్వారులకైన,
సలలిత భోసలవంశ, చంద్రమౌళీశ్వరులకైన ॥౩॥

కేదారగౌళ — జంపె

నాసామిగా నీవు నన్ను కరుణించరా
భోసల కులచంద్ర ! శరభోజ రాజేంద్ర !
నిన్ను నమ్మినదాననేను, నీ పదములకు
వన్నెకాడా ! మ్రొక్కెదరా, వద్దకురారా ॥౧॥
విరహము నే తాళలేరా, వేడ్కతో కౌగిలిరా
గురుకుచముల చిన్న గోరులుంచరా ॥౨॥
ఏకోజిరాజనుత, ఎన్నికవాడా శరభేంద్ర !
శ్రీకర రతికేళి చెలువముగా గూడరా ॥౩॥

కేదారగౌళ — రూపక

కరుణజూడరా, ఘన భోసలేంద్రా
సరసుండా ! దయజూడు; సామి శ్రీతుళజేంద్ర !
ఏవేళ నిన్నునే నమ్మియున్నానురా
నీవె నా దైవము నిజము మ్రొక్కెదరా ॥౧॥
చక్కెరవంటి నీ మాటలు నే విని
చాలమోహించితి, చేనవీయవేరా ॥౨॥
ఏకేంద్ర వినుత సామి ! నా ప్రాయమ్ము
నీ రతికేళి నేలితినౌరా ॥౩॥

కేదారగౌళ — ఆది

ఎంతైన దయజేసి, యేలుకో నా సామి
సంతత కీర్తిసాంద్రా ! సదయ భోసలతుళజేంద్ర !
నేరక నడిచినా, నేర్చి నడిచినా
నేరములెంచక నెనరు బ్రోచే సామి ॥౧॥
నిన్నునెఱ నమ్మినాను, నిను బాసితాళలేను
వనితల మాటవిని, వగలుసేయకు జాణ ॥౨॥
చతుర! ఏకేంద్రవినుత, జనపాల తుళజేంద్ర
రతికేళి నునుగూడి పాలించు నీకు మ్రొక్కెదరా ॥౩॥

కేదారగౌళ — ఆది

కోపము సేయకె, ముద్దుల గుమ్మ!
కోపము సేయకె, భూపాల తుళజేంద్రుతో
సకల విద్యలభోజుండె, చక్కనివాడె
జలజ బాంధవ వంశుడె
మకరంద బిరుదాంకుడె, మహిత దానకర్ణుండె
సకలాంశముల యందు, సాంబ శివుండతనితో ॥౧॥
నిరుపమ గుణ శీలుండె, నీతిపరుండె
నిఖిల జన పాలకుండె, వరకీర్తి విశాలుండె
వాసవ విభుండె, శరణాగత పోషకుండె
తరుణి వానితో ॥౨॥

ఏకోజిరాజ వినుతుండె తుళజేంద్రుడు
ఎనలేని రణశూరుండె, శ్రీకర గుణవంతుండె
శ్రితజనపాలుండె, జోక నిన్నేలినవాడె
సుదతి యతనితో ॥౩॥

... ... ... ...

లాహిరి — చంపు

సామిదయ జూడు మీ వేళ
సదయ శ్రీతుళజభూపాల !

కాముని బారికి తాళలేరా
కౌగిలించి ఆదరించరా ॥

నీ ముద్దుమాటలు నేనువిని
నీ సొగసెల్లను నేనుకని
వేమారు మోహించియున్నానురా
నామీద నెనరుంచి, నన్నాదరించరా ॥౧॥

నీవెగతియని నెఱనమ్మినారా
ఈ వేళ సరసములాడవేరా
తీవిగా గంధము నెమ్మేన బూయరా
భావము రంజిల్లు పదములు వినరా ॥౨॥

సరస యేకోజి రాజేంద్ర! సన్నుత జనపాల
తుళజేంద్ర నీకు మ్రొక్కెదరా గరిమగా
రతికేళి గూడితివేర
ఘనుడ నా మనసు సంతోషమాయెరా ॥౩॥

లాహిరి — ఆది

నిన్నె నమ్మినానురా నా సామిగా
వన్నెకాడ ! తుళజేంద్ర !
వలచి వచ్చినానురా
వలరాజు బారితాళ, వశముగాదు మ్రొక్కెదరా

చెలువుగా దయజేసి చక్కెర మోవియ్యరా ॥౧॥

మగువలతోగూడి, మనసియ్యక తనతో
వగలు జేసితె నిన్ను వద్దనే వారెవరు ॥౨॥

సరస యేకేంద్ర వినుత ! జనపాల తుళజేంద్ర !
గరిమను రతికేళి కలిసి నను గూడరా ॥౩॥

లాహిరి — ఆది

కలకంటి నేనొకటి కలకంఠి! వినవె
సలలిత భోసల తుళజ జనపతి
దయజేసినట్లు
అలముకొన్న మోహమును
అలరు శయ్యపై నుండగను
నా మనసు తెలిసి విభుండు
నవ్వుచు చేర వచ్చినట్లు ॥౧॥
చలువ వెన్నెల బైటను
చెలులతో నాడుచుండగా
చెలువుండావేళను వచ్చి
చిన్ని చన్నుల జీరినట్లు ॥౨॥
సరసి జాక్షి! యేకరాజ
సన్నుత శ్రీతుళజేంద్రుండు
గరిమగా మదను కేళి
కలసి సత్ఫలముల నిచ్చినట్లు ॥3॥

వసంత — ఆది

సరసమైన తుళజ భూపాలునిఁ జూచి
సకియగో! మోహించితి నీవేళ
ఆ సరస గుబ్బలను గోరులుంచి
సరను డెన్నడు లాలించును
విరహము తాళలేను ఈ వేళను
కరుణఁ జూడమనవె ॥౧॥
ముదమున జనపాలు
పొగరుచ్చము మీఱంగా
సదయుడు మదగజముపై నెక్కి
వీధిలో సరి రాగను ఈ వేళ ॥౨॥
ఘనుడు, ఏకేంద్రసుతుండు, దీపాంబికా
తనయుండు, తుళజ భూపాలుడు
వినయముతో నన్ను గూడి
మనసిజకేళి, మనసు రంజిల్లఁజేసిన ॥3॥
... ... ... ...
... ... ... ...

అఠాణ — ఆది

సుదిన మాయెను ఓ చెలియరో।
సదయ భోసలతుళజజనపాలునిఁ జూడగ
విరహము తాళలేను, కరుణ జేయమనంగ
సరసుడు కౌగిలించి, చనుమొనలంటగానె
సరసుండు చతురుండు, సకల జనపాలుండు
కరుణా సాగరుండు రాగా ॥౨॥
ఘనుండు, ఏకేంద్ర సుతుండు
జనపాల తుళజేంద్రుండు
సురత కేళిని నన్ను
జోడు గూడి గూడగానే ॥౩॥

బిల్హరి-ఆది

సుదతిరో! చూడవె, నేటి ముచ్చట
తుళజజనపతి దయజేసె॥
కులుకు గుబ్బలమోవి
జిలుగు పయ్యెదడాసి
చెలువుగా గోరులుంచి
చిన్నెలు జేసెనె ॥౧॥
మొలక నవ్వులతోను
ఎలమి కౌగిటజేర్చి
ఆదరించెనె చాలా ॥౨॥
చతురుండేకేంద్రసుతుండు
సామి తుళజేంద్రుండు
రతికేళి నను గూడి
లాలన జేసెనమ్మా ॥౩॥

ధన్యాసి — జంపె

సామి! దయజూడరా
చాల నమ్మినానురా
భూమి జనపాల, తుళజ
భూపాలచంద్ర ॥౧॥

వలపు నిలుపలేరా
వలరాజు బారికిని
కలంగుచుండె నను
కరుణించు మీవేళ ॥౨॥

... ... ... ...

ధన్యాసి — ఆట

చూడవె గామ! ముచ్చట లెల్ల
వేడుకతో శ్రీ తుళజరాజేంద్రుండు
వెలదిరో! యీవేళఁ జేసిన చిన్నెలు
కలికి! నీబంగారు
జిలుగుపయ్యెదకొంగు
తొలగినదని దయ
తో నావద్దకువచ్చి
చెలియలందఱు జూడ
చెలువుండు హొయలుగా
మొలక చన్నులపైని
నెలవంకలుంచెనె ॥౧॥
కనకాంగి నెమ్మేన
గందము నలదుదామని
ముదమున నన్ను, అలమి కౌగిలించి
మొనసి నాదుకె, మ్మోవి తేనెలాని
ఘనముగా రత్నాల, కమ్మలిచ్చెనమ్మా! ॥౨॥

*బేగడ—ఆది*

రంజిల్లు ఏకోజి
రాజేంద్ర వినుతుండు
మంజువాణి! తుళజ
మహిపాల చంద్రుండు
రంజితముగానన్ను
రతికేళినిగూడి
కంజాక్షి బంగారు
కడియా లిచ్చెనమ్మా! ॥౩॥

బేగడ — ఆది

వలచినాను చాల
వన్నెకాడ ! యీవేళ
సలలిత గుణశీల !
తుళజ మహిపాల !
సామి మ్రొక్కెదరా !
చక్కెర మోవియ్యరా !
కాముబారికి తాళరా !
గ్రక్కున కౌగిలించరా ! ||౧||
నారీమణులలోన
నన్నాదరించి చాల
గారవించి నామేన
గంధముఃబూయరా !
గ్రక్కున కెమ్మోవానరా ! ||౨||
సరస యేకేంద్రనుత!
సామి శ్రీతుళజేంద్ర !
సురత కేళినిగూడి
సొగపుగలుగజేయరా !

బేగడ — అట

రమ్మనెనె కొమ్మ ! నిన్ను
సమ్మతించివాడు
ఎమ్మెకాడు, తుళజేంద్రుండు
ఇంతలో దయజేసి, యీవేళ ||౧||
చక్కగా శృంగారించుకొని
అక్కరతోడుత సంతోషమునను
గ్రక్కున నిన్ను కౌగిలించి
కెమ్మోవి యానను ||౨||
వన్నెలాడి ! నీ వగలెల్లనుగొని
వన్నెకాడు మోహించి చాల
తిన్నెగా నరసములాడుచు

హొయలుగా చెన్నుల
 గోరజీరి లాలింపను ॥౩॥
మంతువెక్కిన యేకేంద్రవినుత
 మహిపాల తుళజ రాజేంద్రుండు
సంతతము నిన్ను జోడెడ బాయక
కంతుకేళి జతగూడి, కరుణింపను ॥౪॥
తానాంతందిరి నానాంతిల్లా నానాం
దిరినా తానాదిరి తిల్లానా తిల్లిల్లా
నాతందిరి, తానాదిరి తిల్లిల్లానా
తిల్లిల్లానా తందిరి దిరి తిల్లానా
తిల్లానా తానాతందిరి నాదరితద్ధళాం
గుక్తధిమిత తిల్లానా తందిరి
దింతాం దింతాం ధిత్తళాంగు తధిమిత ॥౫॥
... ... ... ...

*భేగడ — ఆది*

కొమ్మ ! వీడు ఎటువంటి వాడమ్మ
రమ్మని సైగజేసెనె
 లాలించి కౌగిలించి
ఎమ్మెకాడు, తుళజ రాజేంద్రుండు
 కరుణించెనె
తరుణీ! నీరత్నాల సరులు చూతామని
గురుకుచములపైని గోరులుంచి లాలించెనె ॥౧॥
సుదతిరో ! నీ బేసరి చూతామని యొకసారి
ఉరమున కెమ్మోవి మొనసి నొక్కె నృపశౌరి ॥౨॥
ఏకోజి రాజ వినుతు
 డెలమి శ్రీతుళజేంద్రుండు
జోకను రతికేళి
 జోడుగూడి కరుణించెనె ॥౩॥

*లక్ష్మీరాగం — చంపు*

నాసామిగా నాపై కరుణింపరా
నీదాన నేనురా । భూమీశ తుళజేంద్ర !
 భోగదేవేంద్ర !

చాల వలచినానురా !

చలము జేసేదేమిరా ! ॥౧॥

జాలరా ! నేను తాళజాలను

జాలిగొనియున్న

జవరాల, మ్రొక్కెదను

రారా ! కౌగిలియ్యరా ! రాజసద్గుణహర !

కోరియున్నారా ! గారవించరా ॥౨॥

ఔర ! నీకెమ్మోవి నాననియ్యరా !

సరస యేకేంద్రనుత సామిశ్రీ తుళజేంద్ర !

మరులుకొన్నారా! మనవి చేకోరా !

గరిమగా రతికేళి

కలిసిమనసియ్యరా ॥౩॥

పంతువరాళి — అట

సామిగా కోపమేల, విరహముతాళ

సామి భోసలేంద్ర, సదయ శ్రీతుళజేంద్ర !

చినదానను, మగువ నెంతైనగాని

కలనైన నిన్నెడబాయక,

కలకంఠి బోధనవిని ॥౧॥

నిక్కముగ నిన్ను నమ్మినానురా, హొయలు

గ్రక్కున కౌగిలియ్యరా కరుణ

ఘనుడ శ్రీయేకేంద్రనుత! దీపాంబాతనయ !

జనపాల ! తుళజభూపాల ! శివభక్తిలోల !

వగలు జేసేవేలరా ! తుళజభూప !

వలచినదాననేర ॥౨॥

వగలాడి మాటవిని, వగలాడియని—.

సరస గంధము బూయరా, సరిమేనను

చక్కగా కౌగిలియ్యరా, విరహము తాళలేరా

కరుణ ......... ॥౩॥

చిన్న వయసు దానరా! చెక్కనిసామి
చెక్కిలి నొక్కవేమిరా
కన్యలందఱు జూడ, కన్నడ జేసేదేమిర
మన్యహంధీర! యొక్కఱ
మదనావతార! ॥౪॥

రతికేళి జతగూడరా! ఏకోజి రాజనుత!
తుళజరాజేంద్ర! సతతకీర్తి విహార!
సకల జనాధార! చతురుడా!
మ్రొక్కెదనురా
చెనివియ్యరా!!
సరస గుణవతిహే, తుళజ భూరమణ! ॥౫॥

... ... ... ...

పంతువరాళి — చంపు

కోలెన్న కోలెన్న కోలె
శృంగారకాడె, శ్రితజన కల్పుండె,
యేకేంద్ర వినుతుండె, శ్రీతుళజేంద్రుండె ॥౧॥
ఘనకీర్తిశాలి వాఁడు
ఘనయోగశాలి వాఁడు
ఘన యేకేంద్ర వినుతుండు
ఘనుడు తుళజేంద్రుండు ॥౨॥
మద గజముపై నెక్కి
మార్కండేయు కైవడి
సదయతుళజేంద్రుండు సాగిరాగాను ॥౩॥
చెక్కని గుణశీలుండు, చెక్కని రూపవంతుండు
చెక్కని యేకేంద్రనుతుండు,
చెక్కని తుళజేంద్రుండు ॥౪॥
సరస చంద్ర మౌళీశ భక్తుండు
సరసుండు
సకల యేకేంద్రనుతుండు,
సామి తుళజేంద్రుండు ॥౫॥

### పున్నాగవరాళి — ఆది

నమ్మినాను నిన్నుఁ జాలా నయగుణ శుభశీల
తుళజ భూపాలా!
చెక్కెర మోహవీరా, చక్కని సామిగా మ్రొక్కెను నేను ||౧||
కాముని బారికి తాళఁగక్కున కౌగిలించుమీ
కామించి యున్నాను, ఘనుడా! భోగదేవేంద్ర ! ||౨||
సరస యేకేంద్ర వినుత!
సామి శ్రీతుళజేంద్ర !
పడసగా పరికే!
గరిమతో ననుగూడరా! ||౩||

### పున్నాగవరాళి — ఆది

నేరక నేనునడిచినా
నీవు ప్రాణేశా!
ఓప్పుకోవయ్య ||౧||
సారెకు భోసలవంశ దేవేంద్ర!
సదయ శ్రీతుళజ రాజేంద్ర ||౨||
చిన్నవయసుదాననేని
పిన్నలైతె తెలియలేను
మన్ననతో మాటలాడి
మహిపాల! కరుణించుమీ ||౩||
మదన శాస్త్రము నేరను
మక్కువతోను నమ్మినాను
కౌదమ గబ్బి గుబ్బలను,
గోరజేరి లాలించుమీ ||౪||
చతుర యేకేంద్ర వినుత! చక్కని తుళజ రాజేంద్ర!
రతికేళిని దిద్దుకొని
సతతమునన్నేలుకొమ్మి ||౫||
... ... ... ...

కాంభోజి — అట

వలచినాను నీపై చాల
వలరాజు బారికితాళ
తుళజ జనపాల

చెలువ గంధము బూసి
సామి! కరుణించరా
అలమి కౌగిటి జేర్చి ఆదరించరా
కులుకు గుబ్బలపైన గోరులుంచరా
మోవిచ్చి పాలించుకోర ॥౧॥
ఘనుడ! యేకేంద్రవినుత
జనపాల తుళజేంద్ర
గరిమ సురతకేళి
గ్రక్కున గూడరా ॥౨॥

కాంభోజి — ఆది

కాని కానరాని వగలెల్ల
కాని కానరా
కాని రానీవగలు, ఘనుడ! శ్రీ శాహజేంద్ర !
మ్రొక్కె నీ పాదములకు, చక్కెర మోవియూర
గ్రక్కున నేలుకోరా, చక్కని భోసలేంద్ర! ॥౧॥
నిన్ను నమ్మినానురా
నన్ను కరుణించరా
కన్యలలో నన్ను
కన్నడ సేయనేరా ॥౨॥
సరస యేకేంద్ర వినుత! సామి శ్రీ శాహేంద్ర!
గరిమను రతికేళి, కలిసి యేలితివౌర! ॥౩॥

కాంభోజ — అట

సామిగ నాపై, చలమేల జేసేవుర భూమీశ!
తుళజేంద్ర! భోగదేవేంద్ర!
వలచి వచ్చినానురా; వన్నెకాడ! కోపమేల
వలరాజు బారికి కావక, వశముగాదు
మోవియ్యరా! ॥౧॥
కపురంపు పీడెమీర, కౌగిటఁజేర్చుకోర
అపరంజి సొమ్ములీరా, ఆదరించుకోర ॥౨॥

సరస యేకేంద్రనుత! సామి శ్రీతుళజేంద్ర!
సరస సురతకేళి సామి! నన్నుగూడరా ॥౩॥

సురట — ఆది

నమ్మినాను నిన్నుచాల
నయగుణ శుభలీల!
తుళజ మహిపాల ॥౧॥
వలచినారా, వలపును నిలుపలేరా
వలరాజుబారికి, వశముగాదె మ్రొక్కెదరా ॥౨॥
కన్నడసేయకురా, ఘనుడ! భోసలభూప!
నన్ను కౌగిలించరా, నాసామి నీ దానరా ॥౩॥
సరస యేకేంద్రవినుత! జనపాల తుళజేంద్ర
గరిమ సురతకేళి, కలిసి నన్నుగూడరా! ॥౪॥

సురట — జంపె

సరసగుణశీల తుళజభూపాలుని
జూచి
సకియరో! వలచితిని నేను చాల
వలపు నిలుపవలెనె, వాని తలంచినపుడె
ఏమో
వలరాజు మిగుల నన్నలయించెనె ॥౧॥
కరుణజేసి ఆవేళ నన్ను
కలికిరో! రమ్మనుచు
గారవించినన్ను
కౌగిలించెనె
ఏక మహీపాల సన్నుతుండు
తుళజ భూపాలకుండు
శ్రీకరంబుగగూడె చెలియ! వినవె ॥౨॥
... ... ... ...

సురట — చంపు

నిన్ను నేనమ్మినదానరా, నాసామి
కన్నడసేయక భోసలేంద్ర!
ఘనుడ శ్రీతుళజేంద్ర!

వలచిన నామనసు
తెలిసి వంచనజేసి
పిలచినా యిందురాక
ప్రేమ దాచేదేమిరా ॥3॥
మునుపటి దయమఱచి
మోడిచేకొని తోడి
కనకాంగులెల్ల జూడ
గారవించుకుందురా ॥4॥
తనరు ఏకరాజేంద్రవినుత
శ్రీతుళజేంద్ర !
అనువుగా రతికేళి
నెనసి నన్నేలుకోరా
నవరసాలంకార, నృపతి
సకల జనాధార ! ॥5॥

ఘంటారవం — ఆది

నేడు ముచ్చటజేసెనె నీరజాక్షి వినవె
వేడుకతో భోసల విభుడైన తుళజేంద్రుండు
సరస గంధము నామేన
చక్కగ అలదినన్ను
తరుణి వేఱొకతెకు కపూర తాంబూలమిచ్చె
నమ్మా ! ॥1॥
అలిగియున్నను బిలిచి
ఆదరించి పలికెనమ్మా !
కలికి వేఱొకతెను
కౌగిట లాలించెనమ్మా! ॥2॥
ఘనుడు ఏకేంద్రసుతుడు
జనపాల తుళజేంద్రుండు
నన్ను ఏలినసామి
ఇతర వనితల రంజిల్లజేసెనమ్మా ! ॥3॥

ఘంటారవం — ఆది

ఇంత కోపము సేతురా
ఎవరైనవింటే ఏమి సేతురా
తుళజ భూపాలచంద్ర!

మంతుకెక్కిన యేక మహిపాల సన్నుత !
కోరి వచ్చిన ముద్దుగుమ్మను ఎంచేది
మేరగాదురా నీమీద మోహమ్ము హెచ్చెరా ||౧||
బహుదినముల నీదు పదములె గతియని
మహిపాల! నమ్మిన మగువనునేరా ||౨||
చిఱుత ప్రాయమునాటి
చెలిమిని నన్నేలు
సరస యేకేంద్రనుత సామి! శ్రీతుళజేంద్ర! ||౩||

*సారంగ*

నీసరి దొరలను, నేనెందుగాన
వాసరాధిపవంశవర తుళజభూపాల!
అశ్వారోహణ సామజారోహణములను
విశ్వపాలనముల, వివిధ విద్యల
శాశ్వత కీర్తుల, సకల ధర్మముల
విశ్వేశుభజనల, వితరణమహిమల ||౧||
శౌర్యగాంభీర్యముల, చతురుపాయములను
దయా దాక్షిణ్యములను, కార్యసంగతుల
కమనీయ గుణముల
ఆర్యపోషణముల, నఖిలాంశములజూడ ||౨||
వినయ వివేకముల, విభవ సంపదల
అనుపంబు జలముల, ఘనుడ! యేకరాజేంద్ర
వినుత, దీపాంబికా తనయ
భోసలాబ్ధిసుధాకర! తుళజేంద్ర! ||౩||

*తోడి — ఆది*

ఏల యలుక జేసేవు తెలుపరాసామి
బాలరా, తుళజ భూమిపాల,రా
నీదాననేరా
దేవర చిత్తమునేను,
తెలిసినడుచుకోలేదా?
భావించి మీసేవ నేను
భక్తితో జేయగలేదా ? ||౧||

మేటి విద్యల మిమ్ము, మెప్పింపగాలేదొ
సాటికీ మీ మనసు దెలిసి
　చక్కగ నాడలేదొ ॥౨॥
సరస యేకేంద్రసన్నుత,
　సామి శ్రీతుళజ రాజేంద్ర!
గుఱుతుగా రతికేళి నన్నుగూడ
　వంచనజేసి ॥౩॥

తోడి — ఆది

సామిగా దయజూడరా, భూమిపా దేవేంద్ర!
　భోసల రాజేంద్ర!
వలచి వచ్చినానురా
　వంచన వగలేలరా
వలరాజు బారితాళ
　వశముగాదు ఈవేళ ॥౧॥
గ్రక్కున కౌగిలియ్యరా
　కపూర విడెమియ్యరా
చక్కెర కెమ్మోవీర
　సామి నీకు మ్రొక్కెదరా ॥౨॥
సరస యేకేంద్రవినుత, జనపాల తుళజేంద్ర!
కరుణించి రతికేళి, గరిమతో గూడరా ॥౩॥

గుమ్మకాంభోజి — ఆది

పొట్టనిమిత్తము జనులు, పోటిచేశేరు
వట్టి పాపముల వడికట్టెదు, పొరులు తిట్టేరు
వెండి బంగారు శ్రీ చేత
　విద్యాగర్వములచేత
నిండుసభలోనుండి
　నే సమర్థుడనను కొనేరు ॥౧॥
తాము శుద్ధులనుకొనేరు
　స్వామిద్రోహము జేసేరు
పామర బుధులౌచు
　పరుల దూషించేరు ॥౨॥

సరస యేకేంద్రసుతుని
   శంకరుని తలంచలేరు
పరగ లంచమ్ము పట్టి
   పరుని కొనియాడేరు ॥3॥

*గుమ్మకాంభోజి — ఆట*

శ్రీ తుళజ నృపాలునికి జయమంగళం
ఏకేంద్రవినుతునికి నిత్యమంగళం
మహిపాల శిరోమణికి, మహి జనాధారునికి
మహనీయ చరితునికి, భోసలకులచంద్రునికి
సజ్జనాధారునికి, దుర్జన గర్వహారికి
దిగ్విజయవంతునికి, దీపాంబాతనయునికి
చతురయేకేంద్రవినుత, జనపాల తుళజేంద్రునికి
సరస జనాధారునికి, చంద్రమౌళీశ భక్తునికి

*గుమ్మకాంభోజి — ఆట*

శ్రీరామచంద్రునికి మంగళం
   నిత్యసీతాభిరామునికి
ఇనవంశసోమునికి, నేకేంద్రవినుతునికి
   మనసిజాకారునికి మంగళం
కంజాత నేత్రునికి, కరుణాసముద్రునికి
   మంగళ చరితునికి మంగళం
సీతాసమేతునికి, శ్రితజనకల్పకునికి
   మా తుళజేంద్రపాలునికి మంగళం
శ్రీతుళజ రాజేంద్రునికి మంగళం
ఏకేంద్రవినుతునికి మంగళం ॥
శృంగారాకారునికి, శ్రితజనపాలునికి
సంగీతలోలునికి మంగళం ॥
దీపాంబాతనయునికి, దీనవత్సలునికి
భూపాల తుళజేంద్రునికి మంగళం ॥
ఏకేంద్ర తనయునికి, ఇనకుల తిలకునికి
పాకారి భౌమునికి మంగళం ॥

ఘంటారవం — జంపె

జయమంగళం నిత్య శుభమంగళం
మంగళం భోసలాంబుధిపూర్ణచంద్రునికి
మంగళం సరసగుణసాంద్రునికి మంగళం
శుభకలిత విభవదేవేంద్రునికి మంగళం
తుళజ రాజేంద్రునికి, ధీరునికి
జలధి గంభీరునికి, సజ్జనాధారునికి
విక్రమోదారునికి, నీ శూరుని కీర్తి విస్తారునికి
శోభనాకారునికి, శాత్రవవిదారునికి ॥జ॥
వనితాలోలునికి, విమల శుభ శీలునికి
విబుధ జనపాలునికి, మంజుతర లీలునిక
ఫాలలోచన భక్తిపాలునికి, ఏకేంద్ర బాలునికి
తుళజభూపాలునికినీ ॥జ॥

---

# శృంగారపదములు

చేరి యింకొకసారి చిన్నారి నెమ్మోము
కన్నులు చల్లగా కందునొక్కొ
తెలియనింకొక సారి తియ్యని పలుకులు
వీనుల విందుగా విందునొక్కొ
కదిసి యింకొక సారి కండ చక్కెర మోవి
కమ్మతేనియలానఁ గందునొక్కొ
ప్రేమ నింకొకసారి బిగియారకౌగిట
నదిమి చెక్కిలినొక్కి నబ్బునొక్కొ
చెలిమినింకొక్కసారియై పులక లీన
గళరవంబులుగులుకంగ కలసి మెలసి
యొద్దికల పాన్పు పైచేరి యుందునొక్కొ
అందమగు దారిముద్దుటొయ్యారి గోరి॥ 1
కలికి! నీ బిగి బిగి కౌగిలి దొరకునె
భాగ్యంబు లేనట్టి పల్లవునకు
జలజాక్షి! నీకటాక్షము కల్గనేర్చునె
పుణ్యంబు జాలని పురుషునకును
సకియ! నీ కెమ్మోవి చవులు సిద్ధంబౌనె
మఱి, యదృష్టములేని మానవునకు
అతివ! నీ సురత సౌఖ్యములబ్బ నిచ్చునె
ప్రాప్తి గూడని యోగ బాహ్యునకును
ఏల యిందులకైవట్టి జాలిబొంది
చింతలొనరింప మోహముల్ చిక్కబోనె
తలచినంత, ఋణాను బంధములు లేక
అలరుల కటారి ముద్దుటొయ్యారి గోరి॥ 2
మిడి బెడసరి మీల వడువున నొకవింత
ధళధళ వెడలి సంతస మొనర్ప
చెలువైన తమ్మిరేకుల జాడ నొకనిండు

చకచకల్ బలసి ముచ్చట ఘటింప
వెలలేని కలువ పూవుల తుల నొకమంచి
నిగనిగల్ నిగుడ వెన్నెలలనీన
కలయ వెన్నెల పుల్గు కవజాడ నొకతేట
మిసమిసల్ చెదరి యెమ్మెలు వహింప
జిళుకు బెళుకును నిగ్గును జగ్గు కఱుకు
చుఱుకు సొలపును నిలపును సొంపు నింపు
వాలు చూపుల నింకొక బారి నన్ను
చూడవే ముద్దుటొయ్యారి సొగసుమీఱి॥ 3

చలపట్టి యింతరచ్చల బెట్ట నుడిగట్టు
వలపులేగతి పట్టి నిలుపువాడ
గమకమై దుమికి పై గదియ తెంపువహించు
మమత లేజాడను మఱకు వాడ
చిగురొత్తి యూరకె జిగిబిగిగా నల్లు
నాసలే బాగున నడచు వాడ
అమితమైనెగడి మిన్నంది తత్తర బెట్టు
తమకమే కైవడి దాచువాడ
తలచినప్పుడె నెమ్మేన కలయమొలకు
పులక లొక్కట నెలకొని బలియసాగె
చలము లిక నేల కౌగిట నలమ రాదె
యోర సేయక ముద్దుటొయ్యారి చేరి॥ 4

చిలుకలకొలికి నీ పలుకఁ జేసిననేమొ
జాలిబొంది మనంబు చంచలించు
ఎలనాగ నీవాత పలుక కుండిననేమొ
యదరుచు గుండెఝల్లని కలంగు
ముదిత! నీవాచుక మోముద్రిప్పిన నేమొ
కనుగవలందు చీకట్లు గదియు
చెలి! నీవు నవ్వుచు చెనకకుండిన నేమొ
తమి బూని నెమ్మేను తత్తరించు

ఇందుకేమందు ? నెట్టులోర్తు ? నేమిసేతు?
వలసి యొల్లమిగా, సీమ వారి కరణి
చేయకిటువంటి మాలిమి సేయనెంత
వచ్చెనే? ముద్దుటొయ్యారి వన్నెమీఱి॥ 5

చందమామను జూచి చక్కని నీముద్దు
   మొగమంచు నొకకొంత ముదముగొంతు
కలువరేకుల జూచి బెళుకొందు నీ తేట
   కనుగవలని కొంత తనువుసేతు
పూవు బంతులఁ జూచి పొంగాడు నీగుబ్బ
   లని తమిచేఁ గొంత యక్కచేర్తు
మెఱుపు తీగెను జూచి మించు నీ నెమ్మేని
   సొంపని తప్పక చూడనెంతు
కళవళంబున నొక్కెంత కన్నుమూసి
కలల నీతోడి లోకమై కలసియుందు
వలపు చెడ్డది యెంతటి వారికైన
నలుగకే, ముద్దుటొయ్యారి యానమీఱి॥ 6

చల్లని తమ్మివాసనలను నీ మేను
   గ్రుచ్చి కౌగిట జేర్చు కొనక యున్న
గరగర కండ చక్కెరలూరు నీమోవి
   తేనియల్ తమిదీర నానకున్న
కమ్మని వలపులొక్కట గుల్కు నీముద్దు
   పలుకులు చెవులనింపకయయున్న
అపరంజి తళుకు టద్దపు నీదు చెక్కిలి
   నును గోర జిగి మీఱ నొక్కకున్న
పులకలెగయంగ గళరవ స్ఫురణ మెఱయ
తనియ రతులందు పైకొని పెనగకున్న
తాళలేనింక దయజేసి యేలుకొనవె
ముద్దుటొయ్యారి! వేగనా యొద్దజేరి॥ 7

కలికి! నీ నిడువాలు బెళుకు జూపుల నల్ల
   కలువ దండలు మేన గప్పకున్న
కలకంఠి! ముద్దులు గులుకు నీ చిఱునవ్వు
   తేట వెన్నెలలు పై మీటకున్న

చెలియ! మచ్చికల నీ చిన్నారి చేతుల
    చిగురులు కనుగవఁ జేర్చకున్న
కోమలి! నీగబ్బి కొదమ సిబ్బెపుగుబ్బ
    పూవు బంతులు ఱొమ్ము బొందకున్న
తొడల నటికంబముద్విడి వడకయున్న
చలువ చెమటల పన్నీరు జల్లకున్న
వింతనిట్టూర్పు సురటుల వీవకున్న
తాళనే ముగ్ధ ననుగూడి తనుపకున్న॥ 8

ఈ వెండివెన్నెల కెటువలె నోర్చునో
    మల్లెపూవంటిది మచ్చెకంటి
ఈ సెగల్ గలగాలి కెటువలె తాళునో
    మరువంబు వంటిది మందగమన
ఈ తుమ్మెదల దొమ్మి కెటువలె నిలుచునో
    వనజమ్ము వంటిదీ వనజగంధీ
ఈ విరిశరముల కెటువలె సైచునో
    చిగురాకు వంటిదీ చెలువు చెలువ
వనిత నేరాతిగుండియ వాడనంగ
దిట్టతనముననున్నాడ తెలవమనను
మెత్తనిదియంచు బోవరే మేలుగూర్చ
మదన! మాముద్దుటొయ్యారిఁ గదియఁజేరి॥ 9

పసిమీర నవరంజి పదికనార్చిన లీల
    కస్తూరికిని తావిగట్టినట్లు
కలికి ముత్యము పులు గడిగిన కైవడి
    భావజాస్త్రము సానఁ బట్టినట్లు
మించుటద్దమురహి మించు తోమినజాడ
    ఘనమణికుందను బెనయుకరణి
కమ్మజాజికి పరువమ్ము గూడిన బాగు
    శశినిండు కళలతో నెసఁగు పగిది
వేళవేళకు వింతగా వెలఘటింప
రాని సింగారములు మేనఁ బూని సాని
కులములో వన్నెకెక్కితి జళుకుదేఱి
ముద్దుటొయ్యారి! యన్నిట ముదముమీఱి॥ 10

ఆవల నొకచోట నాసతోనుండుట
    తెలియకచేరుటె చులుకదనము
మఱి యన్యమగుదిక్కు మనసుంచి తిరుగుట
    గనలేక తగులుటె కాని తనము
వేఱొక్కతావున కోరికతో నుంట
    యెఱుగక కవయుట యెద్దెతనము
పరగడ నొకయెడఁ జాఁగా మెలగుట
    తలపక కలియుట పలుచఁదనము
నిలువఁగూడని మదహతి నిగుడుకరణి
వలపు తనకన్న మించిన వనజ గంధి
పొందుగోరుటకాదువటో బుద్ధికెల్ల
తలచవే ముద్దుటొయ్యారి చెలిమిదారి ॥ 11

కడలేనివేడ్కల యెడయకుండెడువధూ
    వరులవేడుకకు భావమునఁ గండి
తమి జోడుగూడి మంతనములాడెడి సతీ
    పతుల ముచ్చటకు లోవల దలంకి
అల్లి బిల్లి గను సయ్యాటల పెనగు దం
    పతుల చిన్నెలకు తాపము వహించి
తనియని రతి గళ ధ్వనులెచ్చి మెచ్చు స్త్రీ
    పురుష సంగతికి నూర్పులు నిగుడ్చి
వలపు నెలకొన నెమ్మేన పులకలీనఁ
దలచి కళవళపడి, సోలి, సొలసి, యలసి
తలిరువిలుకాని దూరగా వలసె వట్టి
జాలిచే ముద్దుటొయ్యారి మేలుగోరి ॥ 12

గొప్ప నెన్నొఱి సునుగొప్పు నిగ్గుల దండ
    మిసమిస నింపు మెఱుఁగిడిన
పుడుమచ్చ మోవిపైఁ దొంకమే చిఱునవ్వు
    తళతళ మెఱయ వెన్నెలలు గాయ
వలచుట్టి వడలెంచు వెసకుచూపుల వాలు
    నిగనిగనింత వన్నియలు గుప్ప
తళుకు చెక్కిళ్లపై పొలయు కమ్మల డాలు
    ధగధగ నొక్క ముదము ఘటింప

ఘల్లు ఘల్లున నందెలు ఘణిలు మనెడి
గిలుకు మెట్టెల రవము త్రొక్కిళ్ళు వార
నిండు చుక్కనమదహతి నిగుడు కరణి
వెడలుఁబో ముద్దుటొయ్యారి వింతదారి॥ 13

చక్కని నును కొప్పె చాలు మోహముగూర్ప
వాలుగన్నులె చాలు మేలు గొలుప
తళుకు చెక్కులె చాలు తగులు పుట్టఁగఁజేయ
బెళుకు చూపులె చాలు బ్రియము నెఱప
చక్కెరకెమ్మోవి చాలు ముచ్చటఁజెప్ప
మొలకనవ్వే చాలు వలపురేప
కులుకు గుబ్బలెచాలు గూర్మికిఁబెనఁగంగ
నొయ్యారములె చాలు నుబుసుఁజేయ
మఱియు చుంబన భేదంబు లెఱిగి, కళలు
చెనఁకి, బిగియారఁగౌగిటఁజేర్చి, సురత
బంధముల చిత్తమలరార భావమెఱుఁగ
నేర్పుఁబో ముద్దుటొయ్యారి నీటుమీఱి॥ 14

గొప్ప క్రొమ్ముడి మంచి కొదమ తుమ్మెద చాలు
నునుమోము వనజ శోభనకరంబు
తళుకొందు కన్నులు బెళుకు బేడిసమీలు
కంఠంబు శృంగార కరము కరము
చెలువైన మృదు బాహువులు మృణాళంబులు
కులుకు గుబ్బలు జక్క వల బెడంగు
కటినివాసంబు సైకత స్ఫుటతటంబు
లూరులంబుకరేణు కరోత్సవంబు
గాగ గవులెంచ సరసాగ్ర గణ్యవైతి
ముద్దుటొయ్యారి యెనలేని ముదముమీఱి॥ 15

మెఱుగు లీనెడి మంచి హరి నీలములరవల్
సరములు గూర్చిన చందమునను
కొదమతుమ్మెద గుంపు గొనివచ్చి యొక్కచో
పొంకమ్ముగా నారుఁ బోయుకరణిఁ

గప్పుమీఱెడినునుకాటుకనుందీసి
యొప్పుగా గుదిగట్టి యునిచినటుల
కళదేఱు చొక్కంపు కల్వపూవులచాలు
చిన్నారిదండలు చేర్చినట్లు
నీరదచ్ఛాయ మాయించి నెమలి పింఛ
ములను వెలగొని, శైవాలములను గెలిచి,
చమర వాలంబులకు లేని భ్రమణమొసఁగి
మెఱయుఁబో, ముద్దుటొయ్యారి కురులుమీఱి॥ 16

వలపునాటినతేట బెళుకు చూపులకొంత
తెగనాడు కొను మోడి వగల కొంత
చిలుపతేనియలూరు మొలక నవ్వుల కొంత
చాలు చాలనెడి వేసటలకొంత
చాయగానాడు మచ్చరపు మాటల కొంత
కినియగారాని జంకెనల కొంత
నెయ్యంబునను జేరు నొయ్యారముల కొంత
తలగి పొమ్మనెడు పంతముల కొంత
ముచ్చటల కొంత చుంబనములను కొంత,
కౌగిలింపుల కొంత, నఖక్షతముల
కొంత, కొసరుల కొంత, పై కొనిన రతుల
తీరునే తమి? ముద్దుటొయ్యారి గోరి॥ 17

తమిపెంచి, తలయూచి, తాల్మి తప్పక చూచి
వాలుకన్నులొకింత తేలవేయు
వేసి, మోమటుద్రిప్పి నెచ్చనూర్చుచునెడ
నభిముఖియై మోవి యాని చొక్కుఁ
జొక్కి, చొక్కపు గోట నొక్కి, కౌగిటఁజేర్చి
బలుపు గుబ్బల ఝొమ్ముఁ బట్టి కుమ్మి
గుమ్మి, తామొనబంట కొరికిన తెలనాకు
మడుపు సగమ్ముకొమ్మని యొసంగు
నొసగి డాకేల ముంగురు లొడిసి చుట్ట
పట్టి, వలకేల చెక్కిలి గొట్టి, తిట్టి
యిట్టు, వగల ఖళా! యని దిట్టయగుచు
కొసరుమాముద్దుటొయ్యారి కూర్మిమీఱి॥ 18

కొదవలెంచినచాయ కోపంబు చేయక
కూర్మిగోరుట తెచ్చుకోలుగాక!
అగచాట్ల నొకమోడి వగబూని యుండుట
చెలిమిఁజేయుట కాన గొలుపుఁగాక
తమక మెంచినవేళ తప్పించి జరపుట
కోరికలో మేలు కొఱకుఁగాక!
కోరివచ్చియు పట్టి సేరమ్ము లెంచుట
కొసరుటల్కాలహించు పసరుగాక!
ఒడిసిపోవక వెసవెసలు బుక రతుల
మనసు దాచక తెగరయే కినుకదెలియ
తిరుగుటయె మోహములకిల గుఱుతుగాక
వెరపుఁజేతురే ముద్దుటొయ్యారిఁజేరి॥ 19

దండఁజేరిన యంత తమి పుట్టకున్న ము
చ్చట గాదు పట్టివేసటయెగాని
తలచినప్పుడె మేన పులకలెత్తక యున్న
మేలుగాదది తెచ్చుకోలుగాని
అంటినప్పుడె వెన్నయై కరంగకయున్న
ఇంపుగాదది కంట గింపుగాని
చెనకిన యపుడె పైకొనక యుండిన కౌగి
లింపు గాదది యడ్డ గింపుగాని
కాన నిటువంటి గుణముల క్రమమెఱింగి
పొందుగావింతురెపుడు నేర్పులు చెలంగ
జాణలైనట్టి రసికులానక్తితోడ
నందమీదారి ముద్దుటొయ్యారి గోరి॥ 20

పలవుగల్గినదానివలె జేరి చలిపోరి
చెలిమిఁజేయుట లేమి చేయనొక్కొ?
తమిగలదాని చందముఁ బూని చనుగుబ్బ
లెదనాని చొక్కించు టేలనొక్కొ?
మేలు గల్గిన దాని లీల జెక్కిలినొక్కి
దక్కించుకొనుటేమి తలచియొక్కొ?
నెనరు గల్గిన దాని యనువున దయవచ్చి
మచ్చికల్ సలుపుటేమాయనొక్కొ?

సందియంబులె యివి వెలసతులకెల్ల
నైజమని యెంచకటు నెఱ నమ్మి మోస
పోయి, వగచుట లెల్ల నా బుద్ధికెల్ల
కొదువగా ముద్దుటొయ్యారి కూర్మిదారి॥ 21

కలికి నెమ్మదికి నిల్కడ కల్గనేర్చునె
గాలికి నిసుమంత కలిగె నేని
పడతి నెమ్మదికి నిల్కడ కల్గనేర్చునె
ఘన పంక్తి కించుక కలిగెనేని
కాంత నెమ్మదికి నిల్కడ కల్గినేర్చునె
కరికరంబున కెంత కలిగెనేని
కామిని మదికి నిల్కడ కల్గనేర్చునె
యలలకు గోరంత కలిగెనేని
దానిపై వారకాంతలఁ దలచెనేని
తెలియనేరక దూరుటల్ ధీరమతికి
తగవుగాదని మానుటల్ దారిగాక
సారెకును ముద్దుటొయ్యారి సరసఁజేరి॥ 22

రమణకోకిల కుహూరారవంబులె కాని
నీ పదాల సొగసుల్ నేఁడు లేవు
కలికి మొక్కలపుఁ బల్కుల బల్కునే గాని
నీ ముద్దుమాటలు నేఁడు లేవు
తరుణి తుమ్మెదగుంపు చుఱుకు సోకులె గాని
నీ బెళుకుచూపులు నేఁడు లేవు
వెలది యచ్చపు పండు వెన్నెలలే గాని
నీ బెళుకుచూపులు నేఁడు లేవు
వెలది యచ్చపు పండు వెన్నెలలే గాని
నీ చిరునవ్వులు నేఁడు లేవు
కళవళమొః లేక నిక్కమోః కాక మోహ
పరవశతోః లేక యన్నియొః భ్రమయొః మరుని
మాయయోః యేమి సేయుదు, మనసు నిలువఁ
దరముటే ముద్దుటొయ్యారి తాల్మిమీఱి॥ 23

ఏపూజ జేసిరోః యెడఁబాయకేవేళ
సరిమోహముల ప్రొద్దు సలుపువారు
ఏనోము నోచిరోః యెడఁబాయకేవేళ
అల్లిబిల్లిగ ముచ్చటాడువారు
ఏదైవమెంచిరో యెడఁబాయకేవేళ
బిగియారఁ గౌగిళ్లఁ బెనగువారు
ఏదానమిచ్చిరోః యెడఁబాయకేవేళ
జోడుగారతుల మల్లాడువారు
వారిఁ గనుఁగొని వలవని వంత గుంది
కోరిగ్రుక్కిళ్ళు మ్రింగి, యేకారియుసురు
మనుచు నోరూరునంతనె ట్లబ్బు నకట
ఆడికలమీఱి ముద్దుటొయ్యారిఁజేరి॥ 24

తలచదోః మునుమున్ను తేనె బల్మి పెనంగి
దక్కించుకొన్న యందంబు లెల్ల
తలచదోః యలనిండు తనులెండుకొనమించి
మాట పట్టిచ్చిన మమతలెల్ల
తలచదోః యొకరేయి కలయిక లాలన
లెంచి నా మనవి పాలించుటెల్ల
తలచదోః యొకవేళ తనుజేరి రతిగోరి
కూర్మితో నలరించు గుణములెల్ల
ఏల ? యివి యెంచి, యెంచి నే జాలిఁబొంద
మఱచెఁగాబోలు నన్నియు మచ్చఁజేసి
నెలత చులకన చేయుటల్ తెలియనైతి
ఆదికలవోటి ముద్దుటొయ్యారిఁజేరి॥ 25

కపట చిత్తులెమేలు గావించునాప్తులై
యేన్ పగవాఁడనౌ టెఱుగనైతి
అగడుఁజేయగ నందు లరయు వారలఁగూడి
నగుఁబాటు జేయుటెన్నంగ నైతి
వనుమాటి యంతమ చనఁబూని పరులకు
యసమిచ్చి రమ్మను। టరయనైతి

మేలనుచుబేలనైనట్టి జాలములకు
తగిలి తెగలేని వలపుల పొగిలిపొగిలి
ఊరివారల దూరుటల్ మేరయగునె
తెలిసెగా ముద్దుటొయ్యారి చెలియ దారి॥ 26
ఏ చంద్రబింబాస్య యింటికేగిన సొంపు
    మించదుగా కంటగించుఁగాని
ఏకంబు కంధరి నీక్షించినను నింత
    మెచ్చదుగా తల నొచ్చుఁగాని
ఏ రమణీమణి చేరఁబోయిన చెల్వు
    జేయదుగా మది రోయుఁగాని
ఏ కోకిలావాణి నెనయఁబోయినరతి
    కొగ్గదుగామళ్ళ నిగ్గుఁగాని,
అంటి ముచ్చటల్ కనియెడి యసములకట
చాలు, మరుఁబారికెటువలెఁతాళుకొందు,
కొందలంబునఁదమి నిల్వఁగూడ దిందు
ఎందుకో? ముద్దుటొయ్యారి యింపుగోరి॥ 27
చంపక గంధి నా సరసలేదని కదా
    కమ్మతుమ్మెద వాత దొమ్మి జేసె
కోకిల వాణిమక్కువ దప్పెనని కదా
    తలిరుటాకులు వాడి యలుగులయ్యె†
లేక యుండిననిది యొక లెక్కఁజేయ
దాయగతి నెన్నఁ జేయు నీ మాయమరుని
బంటు గావించ నీవెంట వెంటఁ దిరుగ
ఆరుదొరైతి ముద్దుటొయ్యారి గోరి॥ 28
అటమటలయ్యె నెయ్యములెల్ల నానాట
    వేడుక లేమేమొ వేతలయ్యె
చిటచిట లయ్యె మచ్చికలెల్లఁ మనసులఁ
    బరగిన మేలెల్ల మఱపులయ్యె
మెరమెరలయ్యె నమ్మికలెల్ల దడపిన
    కూటమికొక యడ్డ పాటులయ్యె
అరమరలయ్యెమోహములెల్ల నుప్పొంగు
    మమతలన్నియు వెడమాయలయ్యె
దయలు దండనలయ్యె నేస్తంబులెల్ల

† రెండు పాదములులేవు.

వలసి యెల్లములయ్యె నిల్వరములెల్ల
నిచ్చు కొలదయ్యె ముచ్చటల్ గచ్చులయ్యె
తెలిసెఁబో, ముద్దుటొయ్యారి వలపుదారి॥ 29

తొలుదొల్త మొలకనవ్వులు గుల్కు నన్నుఁ జేరి
 తమిరెచ్చు ముచ్చటల్ తలఁచితలఁచి
చెక్కు చొక్కపుగోట నొక్కిమక్కువ పెంచి
 వలపెంచు చిన్నెలు తలఁచి తలఁచి
కమ్మని కెమ్మోవి కొమ్మని యొగ్గినన్
 గకలంటు వైఖరిం దలఁచి తలఁచి
కొసరి గుబ్బల రొమ్ము గ్రుమ్మి కౌగిట జేరి
 కలయు నందంబులు తలఁచి తలఁచి

దిగులు దిగులని గుండియ పగులవగులఁ
బొగిలి తెగలేని మమతలఁదగిలి యగడు
వొంది కందర్పశరములఁ గుంది కంది
యోర్వనే ముద్దుటొయ్యారి యుబుసుమీఱ॥ 30

చెలిమితో లాలించి చేరరమ్మని ముద్దుఁ
 బెట్టదుగా దుద్దుఁబెట్టుఁగాని
నెనరంటి నట్టిమన్ననల దగ్గఱికేగి
 నీయదుగా నోర నేయుఁగాని
తమిరెచ్చి కొనగోట తళుకు చెక్కిలి మెల్ల
 మీటదుగా మేలు మాటుఁగాని
కులుకు గుబ్బల రొమ్ము గ్రుమ్మి లెమ్మనుచుఁబై
 కొనదుగా మనసు పెనంగుఁగాని

చెలిమిఁజేసిన మొదలనె యలుక మీద
నలుకలే గాని ముచ్చటై నట్టి రతుల
యొద్దికల గూడి యుండిన ప్రొద్దులేదు
ముద్దుటొయ్యారి యనువు నా యొద్దఁజేరి॥ 31

కలిసి సిబ్బెపు గుబ్బ కౌగిలించినఁగాని
 విరహతాపంబులేకరణి దేఱుఁ
దెఱవకమ్మని మోవి తేనె నానినఁగాని
 బహుమోహదాహమేపగిది మానుఁ

తరుణి నిట్టూర్పు తెమ్మెరలు సోఁగినఁగాని
యీ మేని కాకలేయెడ శమించు
జెలి ముద్దుమాటలు చెవుల నించినఁగాని
యెనలేని బడలిక లెటు తొలంగు

ననుచు మనమునఁ బెనగొను ననువు వలన
దినదినము మనసిజు చింత తెరలి చిక్కి
యితర చింతలుమాని సహింపరాని
యాసలను మీఱి ముద్దుటొయ్యారి గోరి॥ 32

పొందుఁ బాపుట కాక పొలతి! నీ ముద్దు మా
టలు విననీక కొందలముజేసెఁ
బ్రక్కఁబాపుటకాక పద్మాక్షి నీమోము
సొంపుఁజూడఁగనీక చుల్కఁజేసె
అండఁబాపుట కాక సుదతి! నీవు వసించు
నూరనుండఁగనీక యోగుఁజేసె
పలుకు లిఁకనేల? యక్కటా! పాపజాతి
బ్రహ్మకేనాటి పగమదిఁ బట్టియుండె
నాకొ్కా? యేమని దూఱుదు? నోర్చియుండఁ
దరమటే? ముద్దుటొయ్యారి! మరులు మీఱ॥ 33

కుటిలత నీవాలు కురుల చెంతనె కాక
మనసునకేలనే? మందగమన!
ఘన చంచలిత నీదు కన్నులకే కాక
భావంబునకు నేల? చిగురుఁ బోణి!
కఠినత నీచన్ను గవకింతయేకాక
మానసంబునకేల మచ్చెకంటి! *

తగదు నాపాల, యీవేళ తాళఁజాల
నేల? నింతట దయఁజేసి యేలరాదె?
నిలుపఁ గూడని తమి మీఱి నిన్నుఁగోరి
ముద్దుటొయ్యారి! నామీద మోడిదీరి॥ 34

కాలిగోరునకైనఁ బోలనేనని తార
పరికించి వెలవెలఁ బాఱుకున్నె?
నునుపైన తొడలతో నెనయలేనని రంభ
వడిగ బ్రాన్పడి తల వంచకున్నె?

* ఒక పాదము లేదు

తళుకు చెక్కులి సాటి తగనని శశిరేఖ
కనుగొన్నఁ గళచెడి కందకున్నె?
మేని నిగ్గుకు జోడు గానని హేమము
కడలేని కాకలఁ గరగకున్నె?
యింకఁ దక్కిన పూఁబోడు లెల్ల నీకు
జోడుగారని మించి నే నాడనేల
చేరి చూచిన వారల చిత్తమెఱుఁగు
నన్నిట మిటారి ముద్దుటొయ్యారి గోరి॥ 35
అలుకలేటికి? ముద్దు గులుక దగ్గఱఁ జేరి
పలుకవే దయఁజేసి పద్మగంధి!
చలమేల? తమినిముచ్చట దీర బిగియార
కౌగిటఁ జేర్చవే కంబుకంఠి !
కోపమెందుకు మేని తాపంబు బోఁద్రోలి
విందుగావించవే యిందువదన !
కినుక చాలించి చక్కని తేటకన్నులఁ
గరుణించి చూడవే కమలపాణి!
కొదమచన్నులనెద గ్రుమ్మి, మదనకదన
మునను మన్నించి యేలవే ముద్దుగుమ్మ!
న్యాయమటెవీడ, మదినిన్నె నమ్మినాఁడ,
నయ్యయో! ముద్దుటొయ్యారి యండజేరి॥ 36
చెంగావి పావడ రంగు గుబ్బలమీదఁ
గుంకుమ ప్రభకు జగ్గులు ఘటింపఁ
గచముపైఁబూసిన కమ్మ తట్టుపునుగు
జడముడి పూల వాసన పెనంగ
మెఱుగు చెక్కుల మీద మెత్తిన జవ్వాది
నుదుటకస్తురి బొట్టు కుదుటుఁ జూపఁ
దళతళుక్కన మించు బెళుకు చూపుల నిగ్గు
చెదరు ముంగురులు మచ్చికకుఁ బిలువ
చిలువ తేనెలు చిలికెడి మొలకనగవు
గులుకు పలుకుల చక్కెర లొలుక, నలరు
విలుతు చేనుండి విడివడు చిలుక కరణి
చేరుఁబో ముద్దుటొయ్యారి చెలువు మీఱి॥ 37

ముద్దుగుల్కెడి తేట మోమెల్ల చిన్నఁబోఁ
జిలుకల కొలికెంత తలకె నొక్కొ
యిగురారు మోవిపై నెత్తు నిట్టూర్పులఁ
దెఱవనేడెంత చింతించె నొక్కొ
యెనలేని మోహంబు గొనిఁవాడుబాఱిపూఁ
బోడి నెమ్మది నెంత పొక్కెనొక్కొ
చెలువంబుమానిగా నిలి నొచ్చుకొని తానె
పంకజాపత యెంత బడలె నొక్కొ

యేల యీ వేళ నే బాల మేలుఁదలఁచి
చాల తమిమీఱి యీవట్టి జాలిఁబొంది
చిగురువిలుకాని బారికి చెదరి తాళ
వచ్చునే ముద్దుటొయ్యారి వలపుమీఱి॥ 38

తరళికి మెఱుఁగు చిత్తరువు చూపులు గావు
ననవిల్తు చేతి బాణములు గాని
కలకంఠి పలుకుల కమ్మనూర్పులు గావు
చురచుర సోకు తెమ్మెరలు గాని
కలికి నిచ్చపు ముద్దు మొలక నవ్వులు గావు
బలువెంటిఁజూపు వెన్నెలలు గాని
చెలితేటతేనియల్ చిలుకుమాటలుగావు
బెదరు పుట్టెడు చిల్క బిలుకుగాని
అతివశయ్యఁ జదువు పద్యములు గావు
వంతఁ గుందించుకోకిల ధ్వనులు గాని
యిన్ని బాముల కెట్లు సహించువాఁడ
మఱచెనో ముద్దుటొయ్యారి మమత దారి॥ 39

కౌముది సార విఖ్యాతి గాంచఁగలేదొ?
కువల యాహ్లాదంబు గూర్పలేదొ?
సర్వజ్ఞ భూషణోత్సవము గాంచఁగలేదొ?
తారకామోదంబు దాల్పలేదొ?
వాత్రైన కళలచే వృద్ధిఁ బొందఁగలేదొ?
చలువల కెల్లను నెలవుకాదొ?
కన్నంత విరహ మగ్గలముఁ జేయఁగలేదొ?
సన్మార్గవీక్షణ స్థాయి కాదొ?

వనజముల సంపదలు చూరఁ గొనఁగలేదొ?
ఘనచకోరాళికన్నులఁ గప్పుకొనదొ?
వరసుధానిధికాఁడు నూ సరసిజారి
ముద్దుల మిటారి మోముగాఁబోలు చేరి॥ 40

కమ్మ తుమ్మెదల ఝుంకార మోమనిదయ్యె
  చిలుక పల్కులు వాడి ములుకులయ్యె
వలపుల చలిగాలి బలితంపు సెగలయ్యె
  నచ్చంపు వెన్నెలల్ చిచ్చులయ్యె
గండుకోయిల రొదల్ కడు సహింపనివయ్యె
  చిగురుటాకులటన్న వెగటులయ్యె
నెమ్మి నాట్యమ్ముల దొమ్మి కయ్యములయ్యె
  రాయంచగములెల్ల దాయలయ్యె
మధువు మన్మథు డయ్యెమన్మథునిఁ గూడి
విధువు విధుఁడయ్యె, నన్నియు వింతలయ్యె
నౌర! యెనయైన చెలి కనుటైన యపుడె
తాళనే ముద్దుటొయ్యారి మేలుగోరి॥ 41
వనిత! పడకయింట వసియించిననుఁ జాలు
  పులకించి మేనె యుప్పొంగు చుండుఁ
గలికి! నవ్వుచు నీవు కదియవచ్చినఁ జాలు
  సరిలేని యొక విలాసంబు వొడము
సుదతి! నీహస్తమించుక సోకిననుఁ జాలు
  గమకమై తమకమగ్గలిక నిగుడుఁ
గలియు కౌగిట నీవు యెలమి పట్టినఁ జాలుఁ
  బరవశమై యన్ని మఱచియుందు
నింక పలుమాట లేటికి? యిందువదన!
హా! పురాకృతమైన ఋణానుబంధ
ములు సుమీ! లేక యిటువంటి మోహమెందు
గలుగునే ముద్దుటొయ్యారి వలపుమీఱి॥ 42

చిగురుల బోడికి నేమమా తెలుపుమా!
  సరస సద్గుణ ధామ చందమామ
చంపకామోదకసౌఖ్యమా పలుకుమా
  చాలు నీపైఁ బ్రేమ చందమామ!

ఇభరాజయానకు విభవమా నుడువుమా
    సంతోషకరసీమ చందమామ!
రాజీవనేత్రకుఁ దేజమా నైజమా
    సార్తసాస్త్రుని మామ చందమామ!
బెళుకు చూపుల తళుకులు గులుక ముద్దు
చిలుక, చక్కని రా చిల్కా చెలువు గలుగు
చాన కిప్పుడు భద్రమా చందమామ!
తెలియవమా? ముద్దుటొయ్యారి తెఱఁగుఁజేరి॥ 43

వదలని కౌగిళ్ల నదిమి తియ్యని మోవి
    తేనియల్ తమిఁదీర నానియాని
కళలంటి తమిరెచ్చి కదిసి నిద్దపుఁదేట
    చెక్కిళ్ల కొనఁగోట నొక్కినొక్కి
చేరిమోమున మోము చేర్చి తప్పకచూచి
    ప్రియముతో ముద్దులు వెట్టి వెట్టి
కదిసిముచ్చటగాఁగ గవిసిన చెవుల లో
    పల దారివింతల బలికిపలికి
మనసిజుని కేళిలో సరి పెనఁగి పెనఁగి
కోరి యేమేమొ వింతగాఁ గొసరి కొసరి
షేలు తెలియంగ పలుమాఱు మెచ్చి మెచ్చి
కలిసెనా ముద్దుటొయ్యారి వలపుమీఱ॥ 44

నేఁడుగా కోరిక నీడేరె జిలుకల
    కొలికి యల్కలు దీరి పలికెఁ గాన
నేడుఁగా యెన్నెన్నిక లెల్ల సమకూడెఁ
    గలకంఠి చెలిమితోఁ గలిసెఁ గాన
నేఁడుగా నోచిన నేమమ్ము పులమ ము
    ద్దులగుమ్మ కౌగిట నలమెఁ గాన
నేఁడుగా వయసు వన్నియకెక్కెఁజక్కని
    జవరాలు మచ్చిక నలిపెఁగాన
నేడుఁగా ముచ్చటలు దీరె నీడులేని
వేడుకలు చెల్లుఁబడియయ్యె విభవమబ్బె
నెడయకావేళ రతులనన్నేలెఁ గాన
ముద్దుటొయ్యారి తమిమీఱ మోడిదీరి॥ 45

పలుకుతోడయ్యె ముద్దులు గుల్కు రాచిల్క
యళు లెల్ల చెలిమి పియాళులయ్యె
నమ్మితోనటియయ్యె నెమ్మి సమ్మతిమీఱ
వరుసనంచలు పరివారమయ్యె
పికముచ్చరించు కంకుకుని వైఖరియయ్యె
రేరాజు చెలికాని రీతియయ్యెఁ
దుంట వింటి దొరన్న కుంటినకాఁడయ్యె
మధుపు సొంపులు గూర్చు మంత్రియయ్యె
బడలికలు దీర్చి చెమటల బాపుచుండ
భళిర! నమ్మిన బంటయ్యెఁబవనుఁడపుడు
ఔర! పగవారు చుట్టంబులైరి కాదె
ముద్దుటొయ్యారి నన్నుఁజేర ముదముమీఱ॥ 46

మోహనాకారుని మోముఁ జూచినఁజాలుఁ
సొబగైన చంద్రునిఁ జూడనేల?
మదనావతారుని పెదవి యానినఁ జాలుఁ
గండచక్కెరపానకంబులేల?
సరసమౌ నెమ్మేని చాయసోకినఁజాలు
నరుదైన తామర లంటనేల?
శృంగార మూర్తిని చెట్టఁ బట్టినఁ జాలు
గనకాభిషేకంబు కాంక్ష యేల?
కళలఁ జొక్కించి మెప్పించి కౌగిలించి
నీవి వదలించి కదియించి నీటుమించి
రతులఁ దేలించి క్రీడించి రమణమించి
మదన సామ్రాజ్య మేలంగవలదె? మగువ! ॥ 47

సుదతి! నీ నెమ్మోము జూడఁ గల్గినఁ జాలుఁ
బూర్ణ చంద్రుని జూడఁ బోవనేల?
అతివ! నీకెమ్మోవి యాన గల్గినఁ జాలుఁ
బంచదారల చవు లెంచనేల?
అలివేణి! నీగుబ్బలంట గల్గినఁజాలు
గజనిమ్మ పండ్లపైఁ గాంక్షలేల?
కలిసి నీ కౌగిటఁ గదిసి యుండినఁజాలుఁ
దలిరుపానుపుమేలు దలఁచనేల?

మనసుకరగించి నిండారు మమతలెచ్చి
కళల దేలించి సోలించి గారవించి
ప్రేమరెట్టించి రతికేళిఁ బెనగవలదె!
మోదమున మేనులుప్పొంగి మోహనాంగి!!

తనివారనీ పంచదారఁ గేరెడు మోవి
తేనె లించుక యైన నాననైతి
తమిదీర నీమేటి తళుకు చెక్కులిగోట
నొక్కసారైనను నొక్కనైతి
మనసార నీగుబ్బ చనులపై గుజుతుల
మొనయనేపాటైనఁ జెనకనైతి
కోర్కెదీరంగ నీ గుత్తపుఁ గౌగిట
నెనసి యొకింతైనఁ బెనఁగనైతి
పడతి! యవ్వలి కార్యంబు నడవదాయె
వట్టిదూరుకు లోనైతి వ్రతము చెడెన
సుఖము లేదాయెనే ముద్దు సుదతి యింక
మోడి చాలించి యేలవే మోహనాంగి!!

ప్రేమ మీఱఁగ నీవు పిలువ నంపినవేళ
చేరరానైతి నా చెలిమికాఁడ
పడఁతి రమ్మని నన్ను బలుకరించిన యంత
మాటాడనైతి నా నీటుకాఁడ
తేలించి నామోవి తేనియలడిగిన
కొమ్మన నైతి నా యెమ్మెకాఁడ
కళలంటి బిగియనీ కౌఁగిటఁ జేర్చిన
వలదంటి నిన్ను నా వన్నెకాఁడ
మొనసిచేసితిగతినీవు పెనగినంత
సద్దుకొని కూడనైతి నాసామినన్ను
నేరములనెంచి యీవట్టి నెపములుంచి
యలుగనేటికి నా ముద్దులయ్య! రార!!

నిలిచి మాట్లాడితే నిన్ను కాదందురా?
కూర్చుండిరా! మరుల్ గొన్నదాన
ఇంటికి వచ్చితి హీనమా నీకేమి?
చిడిముడి పడకరా! చిన్నదాన

ముద్దుగా నవ్వితే ముత్యాలు రాలునా ?
   యేల యెంచేవురా! మేలుదాన
కౌఁగిటఁ జేర్చితే ఘనమెల్లపోవునా ?
   కడపట నేదూరు పడినదాన
నెమ్మి ముచ్చటలాడక నీవురాక
చెలఁగి నవ్వక కౌఁగిట నలముకొనక
యొంటిగాఁ జేసితివి నన్ను నొంటిదాని
నొక్కపూటైన కటకట నోర్వవశమె॥ 51

తియ్యని మాటలఁ దేలించెదవు గాని
   వద్దచేరఁగరావు వన్నెలాడి!
వలకారి వగలచే వలపించెదవు గాని
   చేయంటగానీవు చిగురుఁబోఁడి!
బెళుకు చూపుల చేత బెదరి చూచెదు గాని
   మోవి యానఁగనీవు ముద్దుగుమ్మ!
తరితీపులొనరించి తప్పించెదవు గాని
   గుబ్బలంటఁగనీవు కులుకులాడి!
ఎన్నిమాయలఁ జేయుదు వింతలోన
చాలునిఁకనైన దయతోడ సరసఁజేరి
వేగ మరుకేళి నలయించి వేడ్కమించి
ముదమున వెలింగి యేలవే మోహనాంగి!॥ 52

---

# "SEETHA KALYANAMU"

(*Yakshagana Natak*)

*by*

**SHAHAJI**

## OPINION OF SCHOLARS

# PLETHORA OF MATERIAL

*From:*

Sri Nidadavolu Venkata Rao, M. A.
(Retd. Professor in Telugu, University of Madras),
"Lakshmikanta Nilayam"
2-2-1137/5
New Nallakunta.
Hyderabad-44.

Date: 9-2-1972

*To*

Sri S. R. Rama Murty, I. A. S.
Secretary for Education,
Government of Andhra Pradesh,
Hyderabad.

Sir,

I received a complimentary copy entitled "SITAKALYANAM" published by the Andhra Pradesh Government Oriental Manuscripts Library and Research Institute.

Apart from other things, I was much attracted by the valuable foreword to it written by Vangmayamahadhyaksha Dr. V. Gopalakrishnaiah, the present Joint Director of the Government Oriental Manuscripts Library and Research Institute.

Yakshagana Literature is being worked out by scholars for the last four decades, but up till now, no scholar has dealt with the subject more deeply than Dr. Gopalakrishnaiah. He has given us through his foreword many interesting and original points, relating to the Yakshagana and its development. He has also clarified many terms, giving their true connotation and elucidated the inseparable connection between Sangita and Sahitya.

I append below some of the new features of the foreword.

Hitherto scholars believed that Yakshagana Literature flourished in the time of Palakuriki Somanada in the 12th century A.D. But here the Doctor proved that it existed even from the earliest times, by tracing the origin of the words Yaksha and Gana (Music) to Vedas, which are the main sources for our sangita and sahitya the inseparable twin arts.

The Yakshas as a particular class of deities appear in Vedas and Puranas. They are also found in Buddhistic Literature. As, they are of divine origin, they can change their forms, and had relations with Gandharvas, Vidyadharas and Kinnaras, known to us as divine musicians. The Yakshas also were musicians as there is a separate Raga in Music called Yaksha Priya and through other works on music.

In this connection, the Doctor, exhibited his varied scholarship in Sangita and placed before us his theory, that the intensive aptitude of the Yakshas for music-Gana might have been the origin of the word Yakshagana.

He then proves, that Yakshagana is both Divine and human. He illustrates this, by quoting the stories of Kubera and Ravana, who belonged to Ramayana times. Kubera is the ruler of Yakshas and he is also known as Kinnaresa - the Lord of Kinnaras who are also musicians. By the story of Kubera, the human aspect of Yakshagana is established.

## YAKSHARATRI

Yaksharatri is a pastime observed on Pournami (full moon day) from earliest times. But some scholars equated this with the word Dipavali. But in all the literature connected with the Dipavali, there is no reference to the Yakshas. But from Tantric studies, we can find out the real meaning of Yaksharatri. There is a Yakshini (Feminine gender) Tulasi, Sakti worshipped on Kartika Pournami day. Even now on Kartika Pournami the Tulasi Puja performance will be celebrated with its completion. In this time there will be dance and music festivals and since, they related to Tulasi Yakshini, the word Yakshagana might have been originated.

## JAKKULA PATA - YAKSHAGANA

Jakkula pata is a pure Telugu compound for Sanskrit Yakshagana. Sans - Yaksha - Telugu Jakki - Jakkulu. Since Jakkulu is considered as a pure Telugu word, scholars opined that originally, there is a class hill tribes known as Jakkulu, who developed a particular kind of dance and music and the word Yakshagana is a Sanskritized form brought into vogue by scholars.

Dr. Gopalakrishnaiah proved that this derivation, though linguistically correct, does not connote the origin of a particular tribe. The word Jakkulu is a desi word relating to 'Jakkini' a kind of dance- and the particular class of maidens who practiced this Jakkini Dance came to be known as Jakkulu. They usually dedicated their lives to the service of God in temples. We can know from late V. Prabhakara Sastry, Kameswari Katha that there are Jakkula Kannelu (Jakkula maidens). Jakkula pata therefore only relate to the particular kind of

music sung at the time of the performance of the Jakkini dance. It cannot therefore be equated with entire Yakshagana, which consists of various kinds of music in Ragas and Talas.

## KURAVANJI - YAKSHAGANA

Kuravanji is a kind of Desi dance in Tamilnadu late Veturi derived the word Kuravanji from the kind of dance performed by Kuruvas, a hill tribe in the Telugu country. Kurava angi Kurava's - anji means foot. In Telugu we find like Yakshaganas, Kuravanjis also. They are styled as "Yerukula Kuravanji" - these are generally performed by "Yerukulu" a class of hill tribes. This particular kind of Yerukula Kuravanji is also described as Yadukula Kuravanji - dance that relates to Yadukula or Yadavakula, who are not at all hill tribes. No doubt there are hill tribes, like Yerukavandru, and Yanadivandru, but it cannot be stated that Kuravanji or Yakshagana relates to a particular kind of tribe and that they are a tribal origin.

Moreover, in Sangita, there is a Raga known as "Kuranji Raga". Here Dr. Gopalakrishnaiah places before us his subtle knowledge of Musical Science by giving the Arohana and Avaraohana and also of Talas. He rightly connect "Kurucha Jampe Tala" with ' 'Kuranji Raga,' Kuravanji might have been a variant of Kuranji Raga (From this part of the foreword, it can be surmised that Dr. Gopalakrishnaiah has given the names of Ragas and Talas to the padas in the present Yakshagana as they will not be generally indicated in the original).

## MARGA - DESI

The two terms Marga and Desi (Classical and Indigenous) first originated from sangita. The Marga sangita *i.e.* Sangita is that which is enunciated by Bharata, and Desi Sangita is the style which is in vogue in various regions or localities. The two terms later on were applied to Sahitya or Literature. In Telugu the literary types that evolved on the basis of Mahakavyas, in Sanskrit with Sanskrit metres is named as Marga Kavita, while the Dwipada, Geya, Udaharana and Yakshagana, with Desi or indigenous metres is called Desi Kavita. The Sanskrit metres are also known as Askhara Chandassulu, and the Desi as Matrachandassulu.

Hence, the Doctor acquaints us with his mastery over the Science of Prosody and proves, that there is no difference in Prosody, as Marga and Desi - by stating that the countless Sama, Artha and Vishama Vrittas, can be deduced from Sanskrit. Prosody, and all the Vrittas which we are particulary indicating as Telugu metres are of Marga origin, and since there is no Marga or Desi distinction in Prosody in Sanskrit the poetry also cannot be distinguished in such a manner.

He also proves, that Desi is but a variation of Marga, by taking into consideration, a number of Marga ragas named Desi and Desi ragas as Marga. One notable point is, that there is "Marga Desi Raga" in Sangita, and this established beyond doubt that, Desi has no separate existence but is a variant of Marga in its evolution. The Desi rachana in Telugu may be defined as the author's skill in moulding the prosody and language according to the genius of the Telugu language on Sanskrit and 'Desi models' as Telugu and Sanskrit are inseparable.

## SANSKRIT YAKSHAGANAS

In this Dr. Gopalakrishnaiah proves, that the first Kavya in the Sanskrit Literature Valmiki Ramayana, is a Yakshagana Kavya as Valmiki himself states that his Ramayana is actually sung by Kusalavas before Rama and his audience. He states that we cannot say that the whole of Ramayana is sung by Kusalavas, in one particular Raga or Tala. They must have sung, that Kavya in consonance with various ragas, and Bhavas, according to the situations in the story and must have captivated the heart of Rama and others by their mellifluous music. He also explained further that Ramayana is not only a Sahitya work, but also a Sangitha work, embodying the principles of Gandharva Sangita.

This is a point well worth consideration. We are studying Ramayana purely from literary aspect, and this foreword brings to our minds the fact that it has to be studied from a musical view point.

The famous Gita Govinda and its imitations like Gita Girisa also written in Sanskrit, contains Desi compositions like Dhavalam, Bhramaram and Mangalam, and hence they can also be styled as Yakshaganas.

## TELUGU YAKSHAGANAS

The Telugu Yakshagana is in vogue from the last one thousand years and we can deduce from Panditaradhya Charitra of Somanatha, that there were performance of Yakshaganas just like Dramas, with characters, costumes and music. The Telugu stage was in existence even at time, as known from the quotations given in this work shadow plays, Mono actions were performed on the stage and all the Sivalilas are performed through these performances.

As the language used in the Yakshaganas is classical, Yakshagana in Telugu can be classified as a type of Drama based on Sanskrit Uparupakas. This also reveals the fact, that Yakshagana belongs to Marga than Desi.

About the present Yakshagana Sita Kalyanam also, he has brought to light some new points, which are left in the introduction. Regarding the Text, he points out, that in this work Janaka belonged to Chandravamsa but Valmiki Ramayana clearly stated that Janaka belongs

to Surya Vamsa. He placed this fact before the scholars for consideration and research. He then discusses about the origin of which is Daruvu frequently used in this as well as other Yakshaganas. He also describes the various situations in which it is used in this Yakshagana.

He also presents to us some interesting points about *Gudya—Kaivaram* and *Sutradhara*.

About Sutradara he has for the first time given not only the definition, but also his importance in both Yakshagana and Drama up till now.

The subject of Yakshagana literature is studied purely from a historical point of view and not from a literary point of view.

The present foreword by the present Joint Director reveals the fact that there is a *plethora* of material for an advanced literary research in Yakshagana and focusses the attention of scholars for a deep and penetrating study on classical lines on this subject.

This is the first time, that how intensively we have to study Yakshagana in all its aspects to evaluate its place in the history of Telugu literature. In this connection I congratulate the Government that a Scholar of Dr. Gopalakrishnaiah's calibre is now the Joint Director of Government Oriental Manuscripts Library.

It is hoped that Scholars will take up the study on the lines of the foreword so as to bring about an authoritative and comprehensive History of Yakshagana literature in Telugu.

Yours faithfully,
*N. Venkata Rao*

డాక్టరు దివాకర్ల వేంకటావధాని, M.A. (Hons.) Ph. D.
Professor and Head, Telugu Department, Osmania University
18-4 R. T., Barkatpura, Hyderabad-27.

వాఙ్మయ మహోధ్యక్ష, కళాప్రపూర్ణ
శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారికి,
Joint Director,
Government Oriental Manuscripts Library and Research Institute,
Afzalgunj, Hyderabad-12, (A. P.)

అయ్యా!

తమరు దయతోఁబంపిన శ్రీసీతాకల్యాణ యక్షగాన నాటకము చేరినది. తమ పర్యవేక్షణమున నది నిర్దుష్టముగను, సుందరముగను ముద్రింపబడినందుకెంతయు సంతోషించితిని. దానికిఁదాము వ్రాసిన తొలిపలుకు చదివితిని. తామందుఁ జివరఁ జెప్పినట్లింతకుఁబూర్వము యక్షగాన వాఙ్మయ చరిత్రలోఁ బరిశోధనలు సాగించిన వారెవ్వరును గుర్తింపని, తెలియఁజెప్పని విషయము లెన్నో వివరించి యక్షగాన వాఙ్మయ చరిత్రకొక క్రొత్తరూపు తీర్చిదిద్దుటకు యత్నించియున్నారు. అది తమ బహుగ్రంథ పరిశీలనమునకును, పరిశోధన పాటవమునకును దార్కాణము.

పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రయందలి ద్విపదలకుఁ దామిచ్చిన యర్థము మిక్కిలి సమంజసముగా నున్నది. యక్షులను గూర్చియు, వారి భౌమాభౌమత్వములను గూర్చియు, యక్షరాత్రి పదార్థమును గూర్చియుఁ దాము గావించిన వివరణము సర్వాంగీకార్యమై యున్నది. యక్షగానోత్పత్తి విషయమునఁ దామొనరించిన వ్యాఖ్యానము తమ సంగీత శాస్త్ర పరిజ్ఞానమును వేయివిధములఁ జాటుచున్నది. దేశిమార్గ విధానములను వివరించి తాము కొన్ని రాగముల నామముల ననుసరించి యక్షగానము కేవల దేశిరచన యనుట కవకాశము లేదని రుజువుచేసి యున్నారు. గీతగోవిందాదులు సంస్కృతమున యక్షగానములే యనుట వాస్తవమే. యక్షగాన నాటకములు సంస్కృతమునందలి ఉపరూపకములాదర్శముగా వెలువడినవని తాముచేసిన సూచన యుచితముగా నున్నది.

సీతాకల్యాణమున జనకుని చంద్రవంశ సంబంధమును గూర్చియు దశరథుని కొల్వున వసిష్ఠునకున్న ప్రాధాన్యమునుగూర్చియు, దరువు, గద్యకైవారము, సూత్రధారుడు అను పదముల యర్థమునుగూర్చియుఁ దాము గావించిన వ్యాఖ్య ప్రామాణికముగా నున్నది. కృత్యారంభమునందలి శ్లోకములు కొన్ని శాహాజీ ప్రశంసలుగను గొన్ని యాతని కాశీస్సులుగను ఉండుటచే నవి యాతని యాస్థాన మందలి పండితులు రచించినవై యుండవచ్చునని నేను భావించితిని. అతనికి సంస్కృతము రాదని నా యుద్దేశముకాదు. దానికేమి? తమ తొలిపలుకీ నాటకమునకు వెలలేని తొడవై యున్నది.

విధేయుడు

దివాకర్ల వేంకటావధాని